నాటికలు

# ఇదీ తంతు!
# దొంగ

పోతుకూచి సాంబశివరావు

మొదటి ముద్రణ: 1956.
రెండవ ముద్రణ:
1500 ప్రతులు.
జనవరి 1966.

ముఖచిత్రం:
పోతుకూచి



వెల : రెండు రూపాయలు

ప్రతులకు:
పోతుకూచి ఏజన్సీస్,
203, మ్యాకోయిగూడ
సికింద్రాబాదు.
ఫోన్ : 73477

ముద్రణ:
చారి అండ్ కంపెనీ,
103, సర్దార్ పటేల్ రోడ్,
సికింద్రాబాదు.

# పాత్రలు - వాటి రూపాలు

1. వైకుంఠం బాబు : బాగా నెరిసిన జుట్టు - కొంచెం తెల్లబడుతున్న మీసం. మొదటి సీనులో ఒకలాల్చీ పంచ తెలుపు - తరువాత రంగాలలో ఒక నల్లకోటు షేర్వాణీలాంటిది. చేతిలో కర్ర, నుదురుపై పంగనామాలు, చెవులకు దుద్దులు, అకు చెప్పులు, వయస్సు 50 సంవత్సరములు.
2. వేణమ్మ : బాగా పురాతన వైష్ణవ గృహిణిలా వేషం. నుదురుపై సింధూర రేఖ. వయస్సు 45 సం.లు
3. బ్రహ్మంకవి : సిల్కు లాల్చి, సిల్కుకండువా, సన్నని మల్లుపంచ, ఉంగరాలక్రాపు, కొంచెం చెదిరి ఉంటుంది. కాలికి బూట్సు చేతిలో గ్రంథాలు. వయస్సు 40 సం.లు.
4. శాస్త్రి : పంచ, వక్షంపై ఒక్క కండువామాత్రమే, క్రాపుపిలక నిలువాటి కుంకుంబొట్టు చేతిలో జ్యోతిష గ్రంథాలు, వయస్సు 40 సం.లు.
5. భిమగ్రత్న కషాయం : లావుగా నల్లగా ఉండాలి. నెత్తిమీద సగం చెక్కిన తల. చెవులకు కుండలాలు, వీభూతి పిండికట్లు ఒంటి నిండా. ఒంటిపైన ఒక కండువా, పంచ, 40 సం.లు.

## పిచ్చివాళ్ళు

వెంకమ్మ : ముసుగులోవున్న నితంతువులా, పిచ్చివాడు.

రావు : చిరిగిన లాగు చొక్కా, చెదిరిన క్రాపు, చేతిలోని తెల్ల జెండాపై ఎర్ర మచ్చలు.

మూర్తి : చేతిలో యినుపముక్కలు, టెస్టుట్యూబులు. చెదిరినసూటు.

దాసు : లుంగీ, లాల్చీ, కుంకంబొట్టు, రెండు కర్ర దిమ్మలతో తాళం వేస్తూంటాడు. బాగా పల్చని క్రాపు పిలక.

# మొదటి రంగం

(వసారా రెండు కుర్చీలు, వైకుంఠం ప్రవేశం)

వై : ఉస్ ! దేముడా ! ఎంత దురవస్థ తెచ్చి నానెత్తిన పెట్టేవురా ! ఒక్కచే రొద. ఒక్కచే గొడవ ! కాస్తసేపు విశ్రాంతి తీసుకుందామంటే వీలు లేదుకదా ! ఉస్. రామచంద్ర : ఏనాడైతే ఆ దేవేరమ్మ మెడలో మూడుముళ్ళూ వేశానో, ఆనాటినుంచి యిదే తంతు. యిదేతంతు! సిగ్గు బిడియం వుండనక్కరలేదూ, ఆడజన్మ యెత్తినతర్వాత ? నల్గురూ యీ భాగోతం చూసి నవ్వుతూంటే, అప్రతిష్టకాదూ ! కులం, గౌరవం, మర్యాదా, ఆలోచించ నక్కర్లేదా అంట ?........

చిన్నప్పుడు మా పెద్దలంతా సంసారం ఆనంద మయం అనిచెప్తే పెళ్ళంటే ఏమిటో, పెళ్ళామంటే అదేదో, అదేదో అనుకుని మురిసిపోయేవాడ్ని ! పెళ్ళామంటే యింత గయ్యాళి పీనుగవుతుందని ఎవరికి తెలుసు ? అలా చెపితే అప్పుడే మానేసేవాడ్ని పెళ్ళి !........అయినా ఏం ? తక్కిన కుటుంబాల్లో చిలకా గోరింకల్లా అందరూ కాపురం చెయ్యటంలే ? దీనికి ఒక్కర్తికే వచ్చిందా ? పగలల్లా ఆ కచేరీలోపడి చిత్రగుప్తుడి చిఠావర్జాల్లాగ, ఒకటేవ్రాత, ఒకటేవ్రాత ! యింటికివస్తే, యీ గయ్యాళి పీనుగు గోలతో రోత. యింతకీ యిది నా నుదిటి వ్రాత...ఏమో ! రెండు పిల్లకాయలు దిగుతే యీ భాగోతం కట్టుతుందేమోనంటే, ఆ యోగం పట్టదాయెను ! ఉస్ : రామచంద్రా ! ఏమన్నా అంటే. మహాంకాళిలాగ విరుచుక పడుతుంది. లేకపోతే శనిగొట్టు పీనుగులాగ, గొల్లుమని

యేడుస్తుంది....చిన్నప్పుడు అనుకునేవాడ్ని, కాలేజీ అమ్మాయిల్లా రెండు యింగ్లీషు మాటలు నేర్పితే బాగుపడుతుందేమో నని. ఆః యిన్నేళ్ళు వచ్చాక చదువేమిటి ?—అదుగో ! తయారవుతోంది. (వైకుంఠం కుర్చీలో కూర్చుంటాడు కోపంగా)

వే : (ప్రవేశించి) యింట్లో యిల్లాల్ని యింతగా 'రవ్వ' పెట్టగూడదు. అందుకనే మొగవాళ్ళని మొండిపీనుగలంటారు.

వై : (నవ్వుతూ లేచి) వేణూ ! వేణూ ! వంటయిందామరి, కచేరీకి వెళ్ళాలి.

వే : వంటాలేదు, పెంటాలేదు. మొద్దుల్లాంటి తడిసిపోయిన పుల్లలు తెస్తే ఎలా వండగలను ? యిల్లంతా పొగ. కళ్ళు చిల్లులుపడి చస్తున్నాను. నా అవస్థ మీకేం తెలుసు ?

వై : వేణూ ! వేణూ ! తడిసిన పుల్లలయితే నాతో చెప్పలేక పోయావా ? నేనేమన్నాను చెప్పూ ఆ ఏడుపు ?

వే : యిరుగు పొరుగువాళ్లు ఏం చక్కటిచీరలు కట్టుకున్నారు. కట్టుకుందామంటే, ఓ మంచిబట్టయినా లేదు.

వై : వేణూ ! మొన్ననేకదూ ! 15 బనారసు చీరలు తెచ్చాను. అవి చాలకపోతే అలా అని చెప్పు, యింకో పదివేసాను—

వే : జానమ్మ, సీతమ్మ వేసుకున్న కాసులపేర్లు ఎంత బాగున్నాయి? వేసుకుందామంటే ఓమంచి నగైనాలేదు.

వై : యింట్లోవున్న ఒడ్డాణం, కంటే రోజూ పెట్టుకో : కాసుల పేరెంత ? మూడ్నిముషాల్లో చేయించేస్తాను.

వే : చాల్లెండి, యిలా చాలాసార్లు చెప్పారు.

వై : చూస్కో ! రేపు సాయంత్రం తప్పకుండా తెప్పిస్తాను. మరి.... కచేరీకి వెళ్ళాలి. వంటయిందా ?

వే : (విసుగుతో) రండి ! భోజనానికి, ఝామునేపు ఆలస్యం చేస్తే. ఎలాగ ?

వై : మా వేణు చాలా మంచిది, మా వేణు చాలా మంచిది. చూశావా ! వేణూ ! యిల్లాంటివి నల్గురూ వింటే, బాగుం టుందా ? మనలో మనమే సర్దుకోవాలి, ఏమంటావ్ ?

వే : చాల్లెండి, ఆ పొగడ్తలకేంగాని, రేపు కాసులపేరు, బనారసు చీరెలు తేకపోవాలి మరి.

వై : తప్పకుండా! ఎంతమాట. మా వేణు చాలా మంచిది, మా వేణు చాలా మంచిది. (నిష్క్రమణ)

శాస్త్రి : (ప్రవేశం) వైకుంఠం బాబుగారూ! వైకుంఠం బాబుగారూ! ఎవరూ పలకటంలేదేం చెప్మా ! అదుగో ఆయనకోటు ఆ చిలక్కొయ్యనే వుంది. యింట్లో భోంచేస్తున్నారేమో ! కచేరీ టయిమవలేదుగా ! వైకుంఠం బాబుగారు చాలా మంచివారు, ధారాళంగా డబ్బుయిస్తారు.యీాయనకిప్పుడు సాముద్రికం ఏమని చెప్పనూ. యీాయన పెళ్ళాం గయ్యాళి, అలా చెబితే కోపం వస్తుందేమో !...ఎందుకైనా మంచిది. యీా ప్రక్కన నక్కి సమయానికివచ్చి ఆయన్ను కలుసుకుంటాను....

(నిష్క్రమణ, వైకుంఠం ప్రవేశం)

వై : ఛీఛీ! ఛీఛీ! మా వేణు చాలా మంచిది. మా వేణు చాలా మంచిది, అప్పుడప్పుడు తిక్క వస్తూంటుంది అంతే! యీ తిక్క ఏదో విధంగా కుదుర్చాలి,—ఎన్ని నగలు, ఎన్ని చీరలు తెచ్చినా దీనికి చాలటం లేదే? కొంపదీసి ఎవడినయినా ప్రేమించి, వాడికి యివ్వటం లేదు కదా! పగల్లా నేను యింట్లో వుండనాయెను ఎప్పుడు....ఏమో ఏం చెప్పగలం? అందుకే యీ ఆడవాళ్ళను నమ్మకూడదన్నారు. ఆడవాళ్ళ మనస్సు కుళ్ళుట! వారి హృదయాలు చూపులలాగే చంచలాలుట! పెద్దలు చెప్పేరు... ఏం యింకోడ్ని ప్రేమించడమేం? నే బాగులేనూ? నా శరీరం కోమలంగా బంగారు వర్ణంగా లేదూ?. (ఆలోచించి) అబ్బే! యిదంతా నా వెర్రి భ్రమకాని, మా వేణు చాలా మంచిది .... అయినా యీ సంసారం యింతకాలం యింత కష్టభూయిష్టంగా వుండటం నాకిష్టంలేదు. దీని అంతు కనుక్కొని తీరుతాను.

శాస్త్రి : వైకుంఠంగారూ! వందనాలు, వందనాలు.

వై : ఓహో శాస్త్రిగారా! నమస్కారాలు దయచెయ్యండి. యీ రోజు మా గృహం పవిత్రమయింది. చాలాకాలానికి వచ్చారు. అంతా కుశలమా ?

శా : ఏదో మీదయవల్ల అంతా క్షేమం. యీమధ్య చాలాచాలా ప్రదేశాలు తిరిగి వచ్చానండి. జ్యోతిషంలో పరిపూర్ణ పాండిత్యం వచ్చేసిందని,నన్ను పరీక్షించి, మా గురువుగారు నాకు చెప్పారు. చూశారూ! గురుడు, శుక్రస్థానంలో వుండటం మూలాన సుమండీ నాకింత పాండిత్యం లభించింది. యేదీ ? మీచెయ్యి యిలా యివ్వండి. మీ హస్తవిశేషం చూడాలని చిరకాలంనుండి నా కోరిక.

వై : అయ్యో! అంతకన్నానా? చూడండి, చూడండి. (అని చెయ్యి యిచ్చును.)

శా : (చూస్తూ) మీపవిత్ర హస్తం ఎలిజబెత్తు మహారాణిగారి హస్తంలా ఆ హా హా....ఎంతపోలికండి ?

వై : అవునండి అప్పుడప్పుడు నేనుకూడా యీ సంగతే అనుకుంటుండే వాడ్ని లెండి.

శా : మీకు త్వరలో యింద్రభోగములతోకూడిన అష్టైశ్వర్యములు ప్రాప్తిస్తున్నవి, చూశారూ! కుజస్థానంలో, ఆ చంద్రవంక యెలా బయలుదేరిందో ?

వై : అవునండోయి! ఆ చంద్రవంక తళతళా మెరుస్తోందికూడాను.

శా : వైకుంఠం బాబుగారు, అన్ని విషయాలూ బాగాగుర్తిస్తారు, చూశారూ! ఆ తళతళ అష్టయిశ్వర్యములను తెప్పిస్తుంది.

వై : శాస్త్రిగారూ ! ఎలిజబెత్తుకు వివాహం కాలేదుగదా! నాకు వివాహం అయిందేమీ అని ఒక్క సందేహం.

శా : బాగా అడిగారు! చూశారూ! చంద్రుడు కుజస్థానాన్ని చుట్టి,ఒక రేఖతో, శుక్రస్థానంలోని త్రిభుజాన్ని కలుపుతూ, బుధస్థానం లోని చతురస్రాన్ని సమీపిస్తున్నాడు. అందుకే మీకు వివాహం అయింది కాని, ఎలిజబెత్తురాణికి చంద్రుడున్నా యిలా తిరగ లేదు. యిదొక్కటే తేడా.

వై : మా భేషుగ్గాచెప్పారు శాస్త్రిగారూ!

శా : అవునాండి! మీఅర్ధాంగి బుగ్గపై ఒక పుట్టుమచ్చవుంది.

వై : (స్వగతం) ఆరి దొంగపీనుగా! నాభార్య బుగ్గపై పుట్టుమచ్చ, నీకెలా తెలిసిందిరా? కొంపదీసి వీడికీ,దానికీ యేమయినా సంబంధ ముందాయేమిటి? (పైకి) నా భార్య బుగ్గపై పుట్టుమచ్చ నీకెలా తెలిసిందయ్యా! వుంటే వుంటుంది, నాయిష్టం. ఆ పుట్టుమచ్చ అలాగే వుంటుంది. నీకెందుకు? చాల్లేవయ్యా! మంచీ మర్యాదా అక్కర్లేదా? యిదేనా జ్యోతిషం చెప్పడం అంటే?

శా : బాబుగారు పొరబడుతున్నారు. మీ చేతిలో రవిస్థానంలో నక్షత్రంవుంది చూశారూ! ఆ నక్షత్రం మీ భార్యబుగ్గపై పుట్టుమచ్చవున్నట్లు చెప్తోంది. అందుకే మీకు అష్టయిశ్వర్యములు లభిస్తాయని చెప్పాను.

వై : అదా సంగతి. అలా చెప్పండి. నిజంగావుంది పుట్టుమచ్చ. అది మా వేణుకు కొత్తఅందం యిచ్చిందండీ!. అందుకే మా వేణుమొహం కళకళ లాడుతోంది.

శా : చూశారూ! మీభార్య చాలా ఉత్తమురాలు, పతివ్రత, వినయ విధేయతలతో నడుచుకొంటుంది.

వై : శాస్త్రిగారూ! మీకు దివ్యదృష్టివుందా అన్నట్టు చెప్తున్నారండీ; నిజంగా మావేణు చాలామంచిది.

శా : మీభార్యపేరు వేణమ్మగారు కదుటండీ?

వై : ఓ హో హో! మీరు మనుష్యులపేర్లుగూడా చెప్పగలరన్నమాట. మీ పాండిత్యం ప్రశంసనీయం. లెండి!

శా : అవునాండి! మీ ధర్మపత్నికి అప్పుడప్పుడు తిక్కకూడా వస్తుంది.!

వై : తిక్క! నా ధర్మపత్నికా! చాల్లేవయ్యా శాస్త్రిగారూ! నేర్చుకు పోయావు. యిదేనా జ్యోతిషం చెప్పడం ?

శా : అదికాదు వైకుంఠం బాబుగారూ! తిక్కంటే జ్యోతిషం భాషలో ప్రణయ కలహం అన్నమాట. !

వై : అలా చెప్పండీ! అప్పుడప్పుడు మా వేణుకు, నాకూ, చిన్న ప్రణయ కలహం వస్తుందిలెండి.!

శా : దేముడు మేలుచేస్తే, మీరు త్వరలో సతీసమేతులై తీర్థ యాత్ర ప్రయాణంచేస్తారు. తిరుపతి వెళ్తారు.

వై : చిత్తం

శా : దేవత మేలుచేస్తే మీ సతీమణి ప్రేమ, హృదయంలోంచి, త్వరలో పైకిపొంగుతుంది. ఆనాడు మీకు సంసారంనిండా ఆనందమయమవుతుంది.

వై : శాస్త్రిగారూ! మీరు చాలా బాగా చెప్తున్నారు. కాని త్వరలో ముగించాలి, కచేరీకి టయిమయిందిగా!

శా : అయ్యయ్యయ్యో! అయితే మీకు ఆటంకం కలిగిందన్నమాట. పోనీ, తర్వాత తక్కిన విషయాలు మనవి చేస్తాను. మీయింటి ప్రక్కనే వుంటున్నాను. 'కో' అంటే గంతేసి వస్తాను.

వై : ( సొమ్మిస్తూ ) యిదితీసుకోండి.

శా : ( తీసుకుంటూ ) అబ్బెబ్బే ! ఎందుకండీ యింతసొమ్ము వైకుంఠంబాబుగారికి ఎవర్ని ఎలా గౌరవించాలో బాగా తెలుసు.

వై : సాయంత్రం మళ్ళీ కలుసుకుందాంలెండి.

శా : చిత్తం. సెలవండి. (నిష్క్రమణ)

తెర.

## రెండవ రంగం

( వసారా-రెండు కుర్చీలు, మేజాబల్ల, పుస్తకం చదువుతూ బ్రహ్మం కవి ప్రవేశం.)

కవిత్వమంటే ఏమనుకున్నావ్?
కల్ల బొల్లిగా మాటలు రెండు
కలిపివేసినా కవనంబౌనా? ॥ క ॥

ఛందోబద్ధం చేసేదంతా
సరళంబైన కవనంబౌనా? ॥ క ॥
పదగుంభనచే గంభీరంబై
భావములేనిచొ కవనంబౌనా? ॥ క ॥

( పుస్తకంమూసి ) కవి మహా చక్కగా చిత్రించాడు! ఇది నావిషయంలో బాగా అన్వయిస్తోందే? అందుకే నేనుగూడా, భావం బాగా స్ఫురించాలంటాను. భావం పుట్టనిదే కవిత్వానికి Inspiration రానేరాదు. Inspiration రాందే కవిత్వం ధారాళంగా ప్రవహించవే ప్రవహించదు. పూర్వకాలపు కవులంటే, నాకిందుకే ఒళ్ళుమంట! వాళ్ళు కవిత్వం మొదలుపెట్టేముందు, ఆ సరస్వతిని స్తుతించకపోతే Inspiration దేవతను ఆరాధించరాదూ? అందుకే వారి కవిత్వం చాలాకాలం ప్రపంచంలో వుండే యోగ్యతలేదు. తిక్కన నన్నయాదు లను ఎంతమంది ఎన్నివిధాల విమర్శించేరు? నన్నుమాత్రం యిప్పటి

వరకు ఎవరూ విమర్శించలేక పోయారు. నేను వ్రాసిన కావ్యాలు, అఖండమయినవి. అవి చాలా కొద్దిమందికే దొరుకుతాయి, తిక్కన నన్నయాదులకవిత మంచిదికాక అందరి నోళ్ళలోనూ పడింది. "Rarity is Beauty" అన్నారు పెద్దలు.

అందుకే నా కవితాధారను కొంచెం కొంచెంగా ప్రపంచంలోకి వదుల్తాను. నా "సంసారం నిండా ఆనందమయం" అన్న కావ్యాన్ని చూసి ఎంతమంది ఆధునిక కవులు కళ్ళవెంట నీరుపెట్టుకోలేదు? కారణం? నా తెలివితేటలు.! కాదు కాదు. నా కవితాధార. కొంతమంది చదువరులు ఆనంద బాష్పాలు బొటబొటా రాల్చారు. యింక వ్రాయబోయే యీ క్రొత్త కావ్యానికి భావాలు బాగా స్ఫురించాలి. "My Dear Inspiration Goddess, Come on! I am Calling you. Come upon me. Give me Ideas to write Kavyam" (కళ్ళు తెరచి) Oh Yes! Inspiration Goddess is Approaching me (కళ్ళుమూసి) I pray you Inspiration Goddess! Come upon me (కళ్ళు తెరచి) O! She is near me! (కళ్ళు మూసి) Yes!".

వై : బాబూ! కవిగారున్నారా ?

బ్ర : కవి ఎవరు ? నా Inspiration సమాధి పాడుచెయ్యకుము ! పొమ్మా.!

వై : కవిగారి ఇల్లు ఇదేనా ? కాదా ?

బ్ర : కవులకు యిండ్లులేవు. వారి భావస్థానమే వారియిల్లు.

వై : బహ్మాంకవి యిక్కడివారేనాండి ?

బ్ర : బ్రహ్మ కవిగాడు సృష్టికర్త! యిప్పుడైనా నేర్చుకో.! పో.!

వై : ఎక్కడో మతిలేని మనిషిలా వున్నావే ? బ్రహ్మగురించికాదు. బ్రహ్మాం కవిగారిగురించి నేనడిగాను.

బ్ర : ఛస్. గొడవపెట్టకు. My Dear Inspiration Goddess! Come upon me భావోద్రేకం కొంచెం కొంచెం ఎక్కుతోంది మనస్సులోకి.

వై : కొంపతీసి నువ్వు చేతబడి చెయ్యవుకదా !

బ్ర : Yes! Inspiration Goddess! భావోద్రేక దేవత పూర్తిగా మనస్సులోకి ఎక్కింది. ఎక్కువ అనుభవం వుంటే గాని, యీ సంగతి ఎవ్వరికీ తెలియదు. కావ్యం తరువాత రాద్దాం: (అవైపు తిరిగి) ఎవరండి మీరు ?

వై : పోవయ్యా! యింతసేపు గుండె దడదడలాడింది. యెందుకు వచ్చానా అని భయంవేసింది. మీరు మాంత్రికులా ?

బ్ర : అటువంటి జాతికి సంబంధించను.

వై : అయితే మీరు ఎవరితాలూకు?

బ్ర : రామచంద్రపురం తాలూకావాడ్ని. నా పేరు పేరువడసిన పెద్ద బ్రహ్మాం కవి.

వై : ఓహో! బ్రహ్మాం కవిగారంటే మీరేనాండి? నమస్కారాలు.

బ్ర : అందుకున్నా నమస్కారాలు. మీకేం కావాలి?

వై : చెబుతానుండండి. అంతా ఒక్కసారి ఎలా చెప్పమన్నారు.

బ్ర : నా కవితాధారలాగే కొంచెం కొంచెం చెప్పండి ఫర్వాలేదు.

వై : మీరు చాలా గొప్పకవులని విన్నాను.

బ్ర : మంచిది, మీరు వినటమేకాదు, నన్ను గొప్పకవిగా యిప్పుడు చూడటంలేదూ?

వై : లేదు. మొదట మీరు దెయ్యాల బరకయ్యలా కనిపించారు. తరువాత బ్రహ్మాం కవిగారనుకున్నాను.

బ్ర : మీరు అనుకుని ఏమి చెప్పదలచు కున్నారు?

వై : మీరు వ్రాసిన సంసారంనిండా ఆనందమయం అన్న కావ్యాన్ని చూసి చదివాను.

బ్ర : ఓహో, మీరు మాకావ్యాన్ని చదివారన్నమాట. యింతకీ అది ఎవరిచ్చారు మీకు?

వై : మాశాస్త్రి అది నాకిచ్చాడులెండి. కాని మాయింట్లో, సంసారాల్లో, ఎక్కడా ఆనందం కనిపించటం లేదేం? యీ కవుల్స్, దుర్మార్గులు కల్లబొల్లిమాటలు కలిపి పుస్తకాల్లో వ్రాయడమే మని నాకు వళ్ళు చిర్రెత్తిందిలెండి. కాని అది మీరు వ్రాశారని తెలిసింతర్వాత, సంతోషించి, కొద్దిగా జ్ఞానబోధ పొందుదామని వచ్చాను.

బ్ర : ఓస్ యింతేనాండి, నేను కావ్యాలు మహా **Inspiration** తో వ్రాస్తానులెండి. అందుచేత చదివినవాళ్ళకు కూడా **Inspiration** పుట్టి వళ్ళుమండటం అని, వంటినిండా జెర్రెలు, తేళ్ళు పాకటం సహజంగా పుట్టుతాయి.

వై : కొంపతీసి నావంటిమీద జెర్రెలు, తేళ్ళు ఎక్కి కుడతాయా అండి ?

బ్ర : అబ్బెబ్బే! ఎంతమాటన్నారు? చికాకు వచ్చిందనటానికి అదొక **Poetical Expression.**

వై : ఓహో! అదయితే ఫర్వాలేదు.

బ్ర : యింతకీ జ్ఞానబోధ మీకేనా?

వై : నాకేనండి. అంటే నేనింకొకరికి చెప్తాను అది నా స్వంతానికి మాత్రం కాదు.

బ్ర : ఏమని జ్ఞానబోధ చెయ్యమన్నారు?

వై : "సంసారం నిండా ఆనందమయం" అని.

బ్ర : నేను కావ్యం వ్రాసిపారేస్తే, యింకా జ్ఞానబోధ చెయ్యమంటా రేమిటండీ ? అది చదవండి మీకే తెలుస్తుంది.

వై : అదికాదండీ! ఆ జ్ఞానం పుస్తకరూపేణా వ్రాశారు. అది నాకు ప్రత్యక్షంగా చూపించమని నేనుకోరేది.

బ్ర : అబ్బే! అదిచాలా కష్టం. అప్పుడు **Inspiration** తో కావ్యాలు వ్రాశాను కాని ఇప్పుడు చూపించడం కష్టమండీ!

వై : మీరలా సెలవిస్తే ఎలా చెప్పండి? మీరు ఆ జ్ఞానం **Practical** గా చూపించగలరు.

బ్ర : అయితే చూపించగలనంటారా ?

వై : ఓహో! తప్పకుండా మీరు తలుచుకుంటే చెయ్యలేనిదేముంది?

బ్ర: ఎలా చూపించమంటారు?

వై: ఒకచిన్న మంత్రముపదేశించండి.

బ్ర: మంత్రమా? అబ్బెబ్బే! మంత్రాలు రావు నాకు.

వై: నాదగ్గర అబద్ధమాడుతారెందుకు? నేను వచ్చేముందు ఏదో మంత్రం పఠిస్తున్నారే!

బ్ర: అది మంత్రంగాదండీ Inspiration Goddess ను ఆరాధిస్తున్నాను.

వై: అటువంటి దేవతనుపాసించటం నాక్కూడ నేర్పమని కోరుతున్నాను.

బ్ర: అది నాకురాదు, ముమ్మాటికీరాదు.

వై: మీకు వచ్చునండీ ముమ్మాటికివచ్చు.

బ్ర: అరే! రాదంటూంటే?

వై: అరే! వచ్చునంటూంటే

బ్ర: నాకు రాదయ్యాబాబూ!

వై: నీకు వచ్చునయ్యాబాబూ!

బ్ర: నీకెవరుచెప్పారు నాకువచ్చునని.

వై: ఎవరు చెప్పడమేమిటి? శాస్త్రి నాతో చెప్పితే.

బ్ర: ఓహో! శాస్త్రిచెప్పాడా మీతోటి? (ఆలోచించి) అయితే వచ్చును!

వై: చెప్పండి! 'అలస్యం అమృతం విషం' అన్నారు.

బ్ర : అయితే యీ మంత్రం ఎవరిమీద ప్రయోగిస్తారు?

వై : ఎవరిమీదేమిటి? ఎవరిపెళ్లాం తిన్నగాలేకపోతే వారిమీదే.

బ్ర : వాతో మీరు స్పష్టంగా చెప్పాలి,

వై : మావేణుమీద....అబ్బే! (అని నాలుక కరుచుకొని) మావేణు చాలా మంచిదిలెండి! చాలామంచిది.!

బ్ర : ఏమండోయి! అబద్ధమాడితే మంత్రం ఫలించదు!

వై : (స్వగతం) చచ్చాన్రా దేముడా! యింతవరకూ యింటిగుట్టు కప్పెట్టుకవస్తున్నానే? యింక తప్పదన్నమాట. అవును డాక్టరు దగ్గరకాకపోతే ఎవరిదగ్గరచెప్తాం రోగం సంగతి? (పైకి) మావేణుకి అప్పుడప్పుడు తిక్కవస్తుందిలెండి. పెంకితనం కొంచెం హెచ్చు.అందుచేత నాసంసారం ఆనందమయం చేసుకుందామని-

బ్ర : మీరిది చాలా జాగ్రత్తగా పఠించాలి.

వై : చిత్తం.

బ్ర : ఎవరికీ తెలియనివ్వరాదు. మీ భార్యకుకూడా.

వై : చిత్తం.

బ్ర : మీరు బాగా మాట్లాడగలరా!

వై : ఓ! దివ్యంగా మాట్లాడుతాను. సంస్కృతం చదివేస్తాను అనర్గళంగా! నన్ను నేను మెచ్చుకోగూడదుకాని....

బ్ర : అయితే ఫర్వాలేదు. యికవినండి. మీరు మీ భార్యకు బాగా కవితాధార పొయ్యాలి.

వై : నెత్తిమీద, వంటిమీద ఎక్కడపొయ్యాలంటారు?

బ్ర : అదికాదండీ! మీరు కవిత్వం మాట్లాడాలన్నమాట.

వై : మీ కవిత్వం నాకెలావస్తుంది?

బ్ర : నేచెబుతాగా! యిట్లాఅనాలి."ఓహోహో! ప్రేయసీ"వర్ణించండి.

వై : ఓహోహో! ప్రేయసీ!

బ్ర : నీమందహాస వదనారవింద సౌందర్యము వర్ణింపతరమా!

వై : నీమందహాస వదనారవింద సౌందర్యము వర్ణింపతరమా?

బ్ర : నీశరీరమెంత కోమలముగానున్నది?

వై : నీశరీరమెంత కోమలముగానున్నది?

బ్ర : నీ మృదు గాత్రము కోకిలకంఠంబేకదా?

వై : నీ మృదు గాత్రము కోకిలకంఠంబేకదా?

బ్ర : ఓహోహో! ప్రేయసీ! నాపై ప్రణయకలహమేలనే?

వై : ఓహోహో! ప్రేయసీ నాపై ప్రణయకలహమేలనే? ... ఓస్. యింతేనాండి. పూర్వకాలపు కవులకావ్యాల్లోని విరహాఘట్టాలు రెండు బట్టీ పట్టేస్తాను.

బ్ర : అదుగో! మీరు పూర్వకాలపు కవులంటున్నారు. వాళ్ళకూ నాకూ పడదండోయి! మంత్రము కూడ ఫలించదు.

వై : పోనీలెండి.మీరు చెప్పినట్లేచేస్తాను. యింకా ఏం చెయ్యమన్నారు?

బ్ర : మీరు అల్లా పొగడాలి. మీ అర్ధాంగి ఏమనినా, కొంత సేపు వినకండి. త్వరలో ఆమె దారిలోకి వస్తుంది. మీరుమాత్రం సర్వదా యిట్లాగే మాట్లాడాలి.

వై : చిత్తం! తర్వాత?

బ్ర: మీభార్య ముస్తాబై యున్నప్పుడు పఠిస్తే చాలా ఫలప్రదమౌతుంది.

వై : చిత్తం.

బ్ర : మీరు యీమంత్రం పఠించేముందు భావోద్రేక దేవత పేరుగూడ ఒకసారి తల్చుకోండి. అప్పుడప్పుడు నా పేరుగూడ తల్చుకోండి. మంత్రం ఘాటుగావుంటుంది.

వై : చిత్తం మరిసెలవా?

బ్ర : ఉండండి యిదిగో! అప్పుడప్పుడు ఆయాసంవస్తే మాట — నాకవితాధారలాగే కొంచెం కొంచెం వదలండి.

వై : అవశ్యం. నేను వెళ్ళనాండి.

బ్ర : మంచిది.

వై : ఓహోహో! ప్రేయసీ! (అంటూ నిష్క్రమణ).

తెర.

## మూడవ రంగం

(వేణమ్మ కూర్చుని పాడుతూ, "వసుధలో వనిత బ్రతుకేహోయి"
"మగనివలచి వలపులొలుక కలుగుగదహోయి"
(వైకుంఠం ప్రవేశం).

వై : మా వేణు చాలామంచిది ఓహో! ముస్తాబై కూర్చుందే! అయితే మంత్రం బాగా ఫలిస్తుందన్నమాట. యిదంతా శుభసూచకం. భావోద్రేక దేవతా! ఓహోహో! ప్రేయసీ! వనమాలీ!

వే. : (విసుగుతో) నాబనారసుచీరలు, కాసులపేరు సంగతి ఏంచేశారు? నాదగ్గర మీ టక్కుల్లు సాగవు.

వై : ఓహోహో! నా లలనామణీ! నీ మందహాసవదనారవింద సౌంద ర్యము వర్ణనాతీతంబే! ప్రియా భామినీ!

వే : (కోపంతో) నామొహం యెట్లావుంటే మీకెందుకు? కాసుల పేరుతెండి.

వై : నావేణు సతీమణీ! కోకిల తీయనిపల్కులవోలె, నీపల్కులు మధురమంజుల భాషణంబులై తేనెలొలుకుచున్నవే!

వే : ఏమండోయి! నా బనారసుచీరలు, కాసులపేరుసంగతి ముందు తేల్చండి.

వై : ఆహాహా! నీబంగారువర్ణమిళితంబైన, శరీరమెంత కోమల ముగా నున్నది? ఆ గండు తుమ్మెదలబోలు కన్నులచెలువము నీలోత్పలముల గేలిసేయుచున్నదే!

వే : ఏమండోయి, ఆ కవిత్వాలు కట్టిపెట్టండి. ఎప్పటికప్పుడు ఈలాగే, ఏమాటకూ సమాధానం చెప్పరు. నేనెంత అవస్థ పడుతున్నానో మీకేంతెలుసు నాబాధ?

వై : పసిమి మిసలందేలు నీ ముఖాంబుజమునరాలు కన్నీటిబొట్లు బంగారు పతకమందలి ముత్తెములభాతి ఎట్లు శోభిల్లుచున్నవో! నీభవదీయ హృదయవిదారకమగు ఏడ్పులు ఎంత కర్ణానం దంబొ చెలీ! ప్రియా!

వే : అయ్యో నాఖర్మం కాలిపోనూ! యిల్లాంటి మొగుణ్ణి నే నెప్పుడూ కట్టుకోలేదర్రోయి! నాకీ మొగుడొద్దర్రోయి!

(గోలచేస్తుంది)

వై : తప్పనశే! మదీయ ప్రియధర్మపత్నీ ! నీరోదన శుమ్మెదల ఝంకారము భాతి విలపిల్లుచున్నదే భామామణీ !

వే : ఈమొగుడుతో నేను కాపురం చెయ్యలేనర్రోయి. నాబాధ ఎవరికీ అఖ్ఖర్లేదర్రోయి! (గగ్గోలు). (శాస్త్రి ప్రవేశం)

వై : ఓసీ ప్రియా రత్నమా! ఏమ్నులతో ఫలితమేమి? నాతో ప్రేమా లాపంబులనాడవే ? (పక్కకు తిరుగును)

శా : వేణమ్మగారూ! ఇదేమిటమ్మా తప్పుగదూ: లెండి లెండి సంగతేమిటి ?

వే : చూడండన్నయ్యగారు! నన్ను ఎలాకొట్టి బాదేశాడో ! నావళ్లు చిల్లులుపడిపోయింది. నేనీయనతో కాపురం చెయ్యలేను.

శా : తప్పు, ఎంతమాటన్నారూ? భర్తను ప్రేమించడం భార్య ధర్మం కాదుటండీ? కాపురం చెయ్యకపోతే లోకం ఒప్పుకుంటుందా? ధర్మ శాస్త్రాలు కోప్పడుతాయి.

వై : ఈ మహ్మతం యిప్పుడెలా పఠించాలి?

వే : ఈ మొగుడుతో నేనింక వేగలేనన్నయ్యగారూ.

శా : ఏదో కాలక్షేపం చెయ్యాలండీ ! తప్పుతుందా ?

వై : (యిటుతిరిగి) ఓరి శాస్త్రిపీనుగా, నువ్వు మళ్ళీ వచ్చావా? నా పెళ్ళాంతో ఒంటరిగా మాట్లాడుతున్నావట్రా! నా ఆనంద మంత్రానికి అడ్డుతగిలావట్రా, ఆరి పీనుగా! అయినా యింకా ఏంచేస్తాడో యిలాగే పరాకుగావుంటా.

శా : వైకుంఠం బాబుగారూ!

వై : ......................

శా : వైకుంఠం బాబూగారూ! యిలా చూడండి.

వై : ......................

శా : నాకెందుకు? ఓహో! మంత్రమా? బాగాపఠించండి. (నిష్క్రమణ).

వై : వదిలింది పీడవదిలింది. శనిగొట్టుపీనుగు వదిలాడు. ఆహాహా వేణూ! నా దెస ఒకసారి పరికించు, నీబాహువల్లతల తుదమున్న పాణిద్వయంబు ప్రసూనంబులకై వడి గ్రాలుచున్న వే.

వే : యిదెక్కడి విపరీతం? ఏమిటీకవిత్వాలు?

వై : నాసుందరాంగనా? ఏమిప్రణయకలహాము తెచ్చినావే యింత వరకూ?

వే : ఎప్పుడూలేదు. ఏమిటీ ఆఘూయిత్యం!

వై : ఆహా! వీణాతంత్రుల స్వరములే నీమృదుగాత్రరవములు.

వే : ఈయనకు కొంపతీసి మతిపోలేదుగదా?

వై : ఓహో! నిర్మలమతిమంతుశాలా! వేణూ! ప్రియా! ..

వే : అయ్యయ్యో! యీయనకి పిచ్చియెక్కింది. నాఖర్మం కాలి పోనూ! యిక్కడ్నించి నన్ను పిచ్చివాడి పెళ్లాం అంటార్రా! ఏంచెయ్యన్రా! భగవంతుడా? ఆ శాస్త్రిగార్ని పిలిస్తే ఏమన్నా సలహా యిస్తాడేమో? దేముడా! (నిష్క్రమణ)

వై : ఆసి పీనుగా! ఎక్కడికిపోతావే? నామంత్రం పూర్తిగాపఠించవీ! నాకుతెలుసులే: నీకు తిక్క కొంత తగ్గింది. యీసారి మంత్రం ఘాటుగా పఠిస్తాను. కవిపేరు తల్చుకుంటే ఘాటుతనం ఎక్కువౌతుంది. బ్రహ్మాం, బ్రహ్మాం, బ్రహ్మాం.

(వేణూ, శాస్త్రి ప్రవేశం)

వే : చూశారా! అన్నయ్యగారూ! ఎంత విపరీతంగా మాట్లాడుతున్నారో.

వై : బ్రహ్మాం. కవిబ్రహ్మాం, బ్రహ్మాం, భావోద్రేక దేవతా! నాలో ఆవేశింపుము.

శా : అవునండోయి! ఇందాక ఏమిటో అనుకున్నాను. యిది పిచ్చే.

వై : ఆహా! ప్రేయసీ! సుందర సుకుమార మధుర మంజుల కోమల ప్రియా!

శా : యీవిధంగా ఒంటరిగా గొణుగుకోవడం, సణుగుకోవడం అన్నవి చూశారూ, పిచ్చివాళ్ళకొక లక్షణం.

వై : ప్రియా: వేణూ: ఆc! యింకా రాలేదేం? కొంపదీసి శాస్త్రి కోసం పోలేదుకదా? నా మంత్రం వృథాగా పోతుంది.

వే : యిదేమిటండీ: యీయనకు పిచ్చి ఎక్కువై పోయింది.

శా : మరేనండీ, నేను మొన్ననే అనుకున్నాను ఆయన జాతకం చూసినప్పుడు. మతి స్థానంలోంచి తెల్విరేఖ అడ్డంగా బయల్దేరడం మూలాన్ని పిచ్చిగ్రహం ఆవేశిస్తుందని.

వే : ఎలాగండీ? ఏంచెయ్యటం ? ఆయనకు నేనంటే ఎంతో ప్రేమ. ఆయనకు మతిపోయిందంటే నాకేమీ తోచటంలేదండీ!

శా : తప్పుతుందాండి: ఏదో విధంగా కాలంగడపాలిమరి. ఏదీ! మీహస్త మొకసారి చూడనివ్వండి! ఆయనకు పిచ్చి ఎప్పుడు తగ్గుతుందో చెప్తా (చెయ్యిచూస్తూ) ఆఁ! ఫర్వాలేదు. మీకు మిథునస్థానం లోని, కుంభరాశికి మీనలగ్నం సమీపించింది. అంటే మీరు సంసార సౌఖ్యాలు పొందుతారన్నమాట. అందుచేత మొగుడిగారి పిచ్చి తగ్గితీరాలి.

వై : ఉస్: రామచంద్రా ఎంతసేపటికీ రాదేం? యీ కవితాధార ఎల్లాగ అడ్డడం? మంత్రం నేర్చుకవచ్చానే! నా ఖర్మంకాలా అని. అయితే పోయిందేముందీ? కొంచెం కొంచెం వదుల్తాను. ఓం బ్రహ్మంకవీ. ప్రియా! వేణూ!

వే : ఎలాగండీ యీపిచ్చి తగ్గేమార్గం?

శా : ఫర్వాలేదు. యీాయన్ని భిషగ్రత్న కషాయంగారి పిచ్చాసుపత్రిలో చేర్చుదాం. మీరు లోపలికి వెళ్ళండి. ఎదురుగుండా వెడితే ఆయనకు మళ్ళా పిచ్చి ఎక్కువౌతుంది.

వే : దేముడా! ఉఁ మా ఆయనకు పిచ్చిత్వరలో తగ్గితే తిరుపతి కొండకు వచ్చి నీదర్శనం చేసుకుంటా. (నిష్క్రమణ)

శా : వైకుంఠం బాబూగారూ : యీాలాచూడండి.

వై : అరి పీనుగా: మళ్ళీవచ్చావా? నీతోమాట్లాడను. (పక్కకు తిరుగుతాడు).

శా : యిలా తిరగండి, నామాట వినండి మరి.

వై : పోవయ్యా: యిప్పటిదాకా నాపెళ్ళాంతో పంచేస్తున్నావ్? నీ దొంగనాటకాలు నాకు తెలియవంటావా?

శా : శివశివా: ఎంతమాటన్నారండీ! నాకు పరస్త్రీలంటే అసలు కాంక్ష లేదండీ?

వై : అయితే యిప్పటిదాక మావేఌతో ఎందుకు మాట్లాడారు?

శా : మీరు యిందాక మంత్రం పఠించారుకదూ! ఆ మంత్రం ఫలితం వేణమ్మగార్కి నివేదిస్తున్నాను.

వై : శాస్త్రిగార్కి నామంత్ర ప్రభావం తెలుసన్నమాట. అయితే మీకెవరు చెప్పారిది?

శా : ఎవరు చెప్పడమేమిటి? నేనేకాదూ మీతోటి బ్రహ్మాంకవిగార్కి మంత్రాలు వచ్చునని చెప్పాను.

వై : అవునండోయి: అన్నట్టు మరచిపోయాను.

శా : మీరు అలా షికారువస్తారేమోనని వచ్చానుమరి సాయంత్రంగదా అని.దారిలో నా జ్యోతిషం గురించి యిష్టాగోష్ఠి సల్పుకోవచ్చు.

వై : ఓ తప్పకుండా పదండి.

శా : దారిలో నాకు ప్రాణమిత్రుడుభిషగ్రత్న కషాయంగార్ని కలుసుకుని తర్వాత అలాపోదాం.

వై : మీమాటకు పల్లెత్తుమాట ఎదురా? మీచిత్తం.

శా : వైకుంఠం బాబుగార్కి సంగతి సందర్భాలు బాగా తెలుసును.

వై : వేణూ! వేణూ!

శా : వేణమ్మగారెందుకండీ మనతో షికారుకి?

వై : బయటకువచ్చి తలుపు వేసుకోమని చెప్పటానికిపిలిస్తే వేణమ్మతో షికారంటారేమిటండోయి.

శా : ఓహో! పొరపడ్డానుసుమండీ! వైకుంఠం బాబుగార్కు [illegible] పదండి. (నిష్క్రమణ).

తెర.



## నాల్గవ రంగం

(భిషగ్రత్న కషాయం కల్వం నూరుతూంటాడు)

భేషం-భేషో భేషజం, భేషంనామన్నారాయణే భేషజం, భేషజం, వైద్యం కషాయం, కషాయం వైద్యం, వైద్యంసే వైద్యం, వైద్యం భేషజం.

ఈ నాటితో భిషక్సిరోమణులలో నే మొట్టమొదటిస్థానం పొందుతాను. నావైద్యం, కషాయం, చూస్తూంటే పెద్దపెద్ద డాక్టర్లు అందరు 'తా' అని నిలువునా నీరయి పోతున్నారు. ఈవూరిలో నేను వైద్యాలయం తెరిచాక, ఎంతమంది పిచ్చివాళ్ళు చేరారు! లెక్కా? పత్రమా? పిచ్చివాళ్ళసంఖ్య హెచ్చయినకొలది నా వైద్యం ప్రభావం హెచ్చవుతోంది. అందుకే ఎంతమంది పిచ్చివాళ్ళు నా వైద్యాలయంలోకి వచ్చినా వారిని త్వరగా పంపించివేయను. దానికి అనేక కారణాలు వున్నాయి. (1) పిచ్చివాళ్ళు అస్తమానం నా ఆసుపత్రిలో వుంటే

నా యశస్సు దిగంతరంబుల వ్యాపించి నా ఫైలు ఎక్కువగుతుంది. (2) చాలాకాలానికి పిచ్చికుదిర్చేనని నాకు డబ్బు ఎక్కువ యిస్తారు. (3) పిచ్చివాళ్ళు చాలాకాలము నా కషాయం త్రాగుతే అసలు వారికి ముందు పిచ్చితిరిగి రానేరాదు. (4) చాలాకాలానికిగాని నా కషాయం పట్టివ్వదు. దానికి కొంచెము మందకొడితనము వుంది.

పిచ్చివాళ్ళ ఆసుపత్రి స్థాపించడములో చాల క్రొత్తపద్ధతులు ప్రవేశపెట్టాను. మంచి తెల్వితేటలుకూడా ఉపయోగించాను. ఒక్కొక్క పారి నా తెల్వితేటలు తల్చుకుంటూంటే ఒళ్లు పులకరిస్తూ ఉంటుంది. ఒక పిచ్చివాడిచుట్టూ పదిమంది పిచ్చివాళ్ళుంటే వారి భావాలు వీడు గ్రహించి, వీడి భావాలు వారు గ్రహించుటవలన, పిచ్చిపూర్తిగా నయమగుతుంది. అందుచేత నేను అందరి పిచ్చివాళ్ళను ఒక్కగదిలోనే పెట్టేస్తాను.

వాము, జీలకర్ర, శొంఠి మూడు నూరేసి, ఒక ఔన్సుడు గోపంచదముతో కలిపి ఉండలు ఉండలు క్రిందచేసి మ్రింగుతే, భేషుగ్గా మనుస్సుకు ఉల్లాసము పుడుతుంది. ఈమధ్య నేనీమాత్రలు తయారుజేసి, "కషాయముండ్సు" అని నామకరణం చేస్తూంటే నాకు మనస్సులో ఉల్లాసం పుట్టి పోయింది. ఏం జెప్పను! పాశ్చాత్యభాష తీరు పులో పదము గంభీరంగా వుంటే పలుకుబడి హెచ్చవుతుందని, కషాయ ముండలు అన్న పదము మార్చేసి "కషాయముండ్సు" అని నామకరణము చేశాను. ఎల్లాగయినా కషాయం మహాచెడ్డ వైద్యం.
భేషో భేషజం, వైద్యంన్నామ నారాయణః కషాయం వైద్యం భేషజం.

(శాస్త్రి, వైకుంఠం ప్రవేశం)

శా: ఏమండోయి: భిషగ్రత్న కషాయంగారూ! క్షేమమా?

భి.క.: ఓహోహో! జ్యోతిషం శాస్త్రుగారా! రండి! విచ్చేయుండి!

ఏదో అంతా క్షేమముగా ఉన్నారు. ఈమధ్య క్రొత్తక్రొత్త మాత్రలూ కషాయాలు సృష్టిస్తున్నానండి. మొన్ననే 'కషాయ ముండ్స్' అని ఒకటి కనిపెట్టేను.

శా : 'కషాయముండ్స్' ఏమిటండోయి! జ్యోతిషం భాషలో విన్న పేరు లాగుందే?

ఖి.క. : చూశారూ! మీరు నేను ప్రాణస్నేహితులవడము మూలాన సుమండీ? జ్యోతిషం భాషకు, కషాయం వైద్యానికి మిక్కిలి దగ్గరసంబంధం ఏర్పడిందండీ! ఆఁ అన్నట్టు ఆయన ఎవరండీ?

శా : ఈయన వైకుంఠంబాబుగారనీ కచేరీలో గుమస్తాగారు.

ఖి.క. : నమస్కారమండీ బాబుగారూ! అల్లాగవున్నారేమి? మీకు పిచ్చి యెక్కిందాండీ! నాడి చూడనీయండి.

వై : ఇదేమిటండోయి! మీయింటికి వచ్చానుగదా అని నాకు పిచ్చి ఎక్కిందంటారేమిటండి?

ఖి.క. : అది మీ వాలకంలో కనిపిస్తూంటే, అబద్ధమాడుతారేమిటి?మీకు పిత్తం, వాతం, శైత్యం, మిళితమయి బుఱ్ఱలో దొళ్ళుదొళ్ళ లాడుతూ పిచ్చియెక్కించేయి.

వై : ఏమయ్యా శాస్త్రిగారూ! ఇదేనటయ్యా మర్యాద చేయించడం!

శా : అంతేనండి! మా కషాయంగారు ఎవరిలో పిచ్చివున్నా ఇట్టే చెప్పేస్తారు. నిజంగా మీకు పిచ్చి ఎక్కింది.

వై : అరి దొంగపీనుగా! నాకు పిచ్చిఎక్కిందా! నాకు పిచ్చి ఎక్కు-తుందని జ్యోతిషంలో ఒక్కసారిచెప్పావు గాదేమి.

శా : అప్పుడు చెప్పడం మరచిపోయేను. నిజంగా మీజాతకంలో పిచ్చి ఎక్కుతుందని వ్రాసేవుంది !

వై : అయితే తప్పదన్నమాట! నాకే పిచ్చి! నిజంగాపిచ్చి ఎక్కిందన్న మాట! ఎందుకు ఎక్కిందీపిచ్చి నాకు?

భి.క. : అది సహజంలెండి! అల్లాగే పిచ్చి ఎక్కుతుంది.

శా : ఈయనకు కషాయం వైద్యం చేయించండి. పాపం! వేణమ్మ గారు ఒక్కరూ బెంగతోవుంటారు. ఇంటిదగ్గర ఆవిడకు సంగతి చెప్పివస్తాను (నిష్క్రమణ)

వై : ఓరి నీదుంపతెగా! ఇదిట్రా నీవుచేసిన మోసము: మా వేణుతో ఒంటరిగా మాట్లాడటానికా యిదంతాచేస్తా?

భి.క. : అదేమీ కాదులెండి; మీకు రెండు "కషాయముండ్సు" యిస్తాను మంచినీళ్ళతో వేసుకోండి ! మనస్సులో ఉల్లాసం పుడుతుంది.

వై : తప్పదూ? యీ మాత్రలు మింగాలంటారు (మ్రింగి) దేముడా! నాకు పిచ్చిలేందే పిచ్చి ఎక్కిందంటారేమిటి ?

భి.క. : ఏమండోయ్! మీరు అల్లా దిగులు పెట్టుకుంటే పిచ్చి తగ్గదు. ఈపాటికి మనస్సులో ఉల్లాసం పుట్టాలె ! ఎలాగ ఉందండీ !

వై : ఆఁ పుట్టుతూందండీ ! ఉల్లాసం బాగా పుడుతూందండీ! పొట్టలో పుట్టి నెత్తిమీదకు పాకిందండోయి ! ఆహా ! ఏమి ఉల్లాసం ! ఉల్లాసం !

భి.క. : అవునండి! ఆ ఉల్లాసం కొంచెము తగ్గించండి ! మీకు కషాయం వైద్యం చేస్తాను. అప్పుడు ఉల్లాసం బాగా పెరిగి పిచ్చి ఎక్కువగుతుంది.

వై : చచ్చేనురా దేముడా ! మీరు పిచ్చి తగ్గడానికా పిచ్చి హెచ్చడానికా యీ మందు యిస్తుంటా ? అయితే నాకు అసలు పిచ్చి లేదన్నమాట,

ఖి.క. : మీకు నిజంగా పిచ్చివుందండీ ! అంటే బాగా పిచ్చి ఎక్కు వయిన తర్వాత రెండు "కషాయముండ్సు" మ్రింగుతే తిరిగి పిచ్చి పూర్తిగా తగ్గుతుంది ! పెరుగుట విరుగుటకొఱకే అని, ఉష్ణం, ఉష్ణేణ శీతలం అని సామెతలు వినలేదూ !

వై : అయితే యింకా ఎంతకాలం పట్టుతుందండీ ! ఈ వెధవపిచ్చి తగ్గడాన్కి ?

ఖి.క. : చాలాకాలము పడుతుందంసోయి! యిక్కడే వుండండీ! ఇంకా పిచ్చివాళ్ళను మీదగ్గరకు పంపుతాను. వారి భావాలతో మీ భావాలు దూర్చి జ్ఞానం పొందండి భేషోభేషజం, కషాయం వైద్యం, నామన్నారాయణే. (నిష్క్రమణ).

వై : ఉస్! రామచంద్రా! నాకు పిచ్చిలేందే పిచ్చి ఎక్కిందంటా రేమిటి? ఎక్కడెక్కిందిపిచ్చి! ఒంటిమీదా! నెత్తిమీదా ? బట్టల మీదా?... అబ్బే యెక్కడాలేందే? ఇందాకటినుంచీ నేచూస్తూనే వున్నానుగా! నాకు ఎక్కడా కనిపించలేదు. ఎక్కడ ఎక్కిందీ పిచ్చి? పోనీ స్పర్శజ్ఞానమైనా కలుగలేదు ఏమిటో! ఈ పిచ్చి ఎక్కడానికి ఎక్కడా అర్థం లేదు. పీడిమొహాం! యింకా పిచ్చి వాళ్ళను నాదగ్గరకు పంపుతాడట! ఎందుకో! ఏడ్చినట్టుగానే వుంది పీడివైద్యం! వారిభావాలలో నాభావాలు దూర్చాలట! ఇది యెట్లాగా ! పీడిమొహం ! ఏమిటో ఉండలట కషాయ ముండ్సు యిన్ని మింగబెట్టాడు! మేకపెంటికల్లాగ! తుఫ్ తుఫ్! వెధవ వుండలు. ఇదేమి అఘాయిత్యం! ఆసుపత్రిలో వితంతువు లుంటారా? ఈమధ్య కాలేజీ అమ్మాయిలు పెద్ద పెద్ద చదు వులు చదువుకొని డాక్టరమ్మలవుతున్నారని విన్నాను కాని,

యిల్లా పితంతువులుకూడ ముసుగులు వేసుకుని డాక్టర్లవు తున్నారని ఎరుగనే! ఆహా; ఏమి విపరీతభావాలు పుడు తున్నాయి యీ ప్రపంచంలో! పోనీ మనకెందుకు! ఈ డాక్టరమ్మగార్కి ఒక నమస్కారము పెడదాం! పిచ్చి త్వరగా తగ్గేటట్టుమందైనా యిస్తుంది.

(వెంకమ్మ ప్రవేశం)

డాక్టరమ్మగారూ! నమస్కారాలు! నన్ను తీస్కువచ్చి పిచ్చి ఆసుపత్రిలో పారేశారు. నాకు పిచ్చిలేందే పిచ్చి అంటారేమి టండి?

వెం : బావా! నే మునుపటివలె నున్నానా? నా సొగసుచూడు సొగ సందముచూడు. బావా! నే మునుపటివలె నున్నానా?

వై : నీ పిండాకుడు. నన్ను బావా అంటావేమిటి? నీకూనాకు సంబంధం ఏంవుందీ?

వెం : బావా నామనువర్తిమాట ఏంచేశావు?

వై : నీ మనువర్తి ఏమిటి? కొంపదీసి నీవు డాక్టరమ్మవు గాదేమిటి? అనవసరముగా నమస్కారము పెట్టేనే!

వెం : నడకచూడు నడకందము చూడు! బావా! నే మునుపటివలె నున్నానా?

వై : ఆఁ ఏడ్సినట్టుగా నేవుంది! నీఅందం — నాఅందం.

వెం : బావా! నన్ను 'పోతన' సినిమాకి తీసుకవెళ్ళవు?

(మీదకువస్తుంది)

వై : చాలు చాలు, దూరంగావుండు. మీదకు వస్తావేమిటి?

వెం : పోవోయి బావా! గుత్తివంకాయ కూరోయిబావా!

వై : ఏడిసేవు పెట్టిపీనుగ!

వెం : పెట్టిబావా ! కోరివండినానోయిబావా ! గుత్తివంకాయ కూరోయిబావా పెట్టిబావా? (నిష్క్రమణ)

వై : ఏడిసేవు పెట్టిపీనుగ!...... ఇది పిచ్చిదిలావుందే?

(రావు ప్రవేశము)

రా : గిర్ గిర్ గిర్ గిర్ International Plate గిర్రుగిర్రుగిర్రుసామ్రాజ్య తత్వం దుండగీడుల దౌర్జన్యాలు నశించాలి. గిర్రుగిర్రు— సమత్వం, సౌభ్రాతృత్వం, స్వాతంత్ర్యం కావాలి గిర్రుగిర్రు అంతర్జాతీయ వెండిపళ్ళెరం—వెండిపళ్ళెరం గిర్ గిర్ గిర్

వై : బాబూ ! తమ రెవరండీ ! కషాయంగారి గురువుగారూ, రాజకీయవేత్తలు, బుద్ధిమంతులులాగ వున్నారు ?

రా : కషాయం, గిషాయం, మషాళా నాస్తి. గిర్ గిర్ గిర్ నా నెత్తి మీద వెండిపళ్ళెరం గిర్రుమని తిర్గుతోంది! చూస్తిరా చూడుడు! నీవు దానిని తీస్తివా ?

వై : నీ పళ్ళెం నాకెందుకు ? అసలు నీ నెత్తిమీద ఆ వెండిపళ్ళెం లేనే లేందే ! వెండిపళ్ళెం నే తీశానా ? ఇది మహా చాలా బాగుందే?

రా : గిర్ గిర్ ! అంతర్జాతీయపు వెండిపళ్ళెరం గిర్రుమంటుంది. ప్రపంచంలో శాంతి నెలకొల్పుతుంది. సామ్రాజ్యాలు కావాలి, ప్రజారాజ్యం పోవాలి. నీవు చావాలి, నేను బ్రతకాలి !

వై : నీ మొహం తగలెయ్యా! ఏమిట్రా నీ ఆలిభాష !
నేచావడమే ? నువ్వే చావు పీనుగ! మనిషికి మర్యాద అక్కర్లేదూ ?

రా : ప్రజే నేను, నేనే ప్రజ, గిర్ గిర్ ! ప్రజాభ్యుదయం, ప్రజాభిప్రాయం, ప్రజారాజ్యం యిది. కూలీలంతా మీరు- నేను కష్టజీవిని- గిర్రుగిర్రు అంతర్జాతీయపు వెండిపళ్ళెరం !

వై : ఏం తీరువురా బాబు ! నీగోల ఏమిటిరా నాకు ?

రా : చూడు నా వెండి పళ్ళెం చూడు. (చెయ్యి నెత్తిమీద పెడతాడు)

వై : ఛఛ నాచెయ్యి పట్టుకుంటావేమిటి ? నీతలలో పేలుకుడతాయి.

రా : గిర్రుగిర్రు International Plate అంతర్జాతీయపు వెండిపళ్ళెం. Magic-Politics. World Peace, War, States, Nations, Treaties, Peace, Freedom, Progress, Independence, గిర్రుగిర్రుగిర్రు International Plate.

(నిష్క్రమణ)

వై : ఆఁ ఏం తీరువ ! గిర్రుగిర్రుట !......నీ బుఱ్ఱగిర్రుమని తిరుగ.

( దాసు ప్రవేశము )

దా : భజగోవిందం భజగోవిందం.

వై : అమ్మయ్య. భజగోవిందం భజగోవిందం !

దా : నీ మొహం మొత్తా, సంప్రాప్తే సన్నిహిత మరణం.

వై : ఆఁ భక్తి వెల్లిపోతుంది ! ఇటువంటివాళ్ళు ఉండబట్టే దేవుడు కోపంవచ్చి ప్రళయం రేకెత్తిస్తాడు.

దా : ఆత్మారాముడను. నేనే దేముడను. భక్తి, మోక్షం, తాత్పర్యము. సేవ, పూజ, పువ్వులు, విగ్రహాం, హారతి, కొబ్బరికాయ, అరటిపండ్లు, నైవేద్యం, ఇదే నా ప్రసాదము. అదే నీ మోక్షము.

వై : ఏం పాపం చేసుకొన్నానోగాని, యీ పిచ్చి ఆసుపత్రిలో తీసుకొవచ్చి పడేశారు నన్ను. ఎలాగ యీ వెధవసజ్జుతో వుండడం యిక్కడ ? ఇంకా రెండు రోజులు యిక్కడవుంటే నిజంగా పిచ్చి ఎక్కిపోతుంది నాకు.

దా : చేసుకున్న పాపమోయి శంభులింగమా !
అనుభవించక తప్పదోయి ఆత్మలింగమా ?

వై : ఆః ఏం భాగోతంరా దేముడా !

దా : కస్తూరి హారతిదే । కమలజదళనయన నీకు । సుందర సుకుమార గాత్ర నందకుమార । లింగమా ; లింగమా ; భజగోవిందం, భజగోవిందం. (నిష్క్రమణ)

వై : ఆః లింగమా ! లింగమా ! జంగింలింగంలా మొహాము నువ్వు!

(మూర్తి ప్రవేశము)

మూ : **Reactions, Reactions.** రసాయన పరిణామాలు. బుస్ బుస్ బుస్ రసాయన పరిణామమే ప్రపంచము, ప్రపంచమే రసాయన పరిణామము బుస్‌బుస్‌బుస్.

వై : వీడెవడురా ! నా దుంపతెంపే యములాడిలా వున్నాడు.

మూ : గట్‌గట్‌గట్ Filtration, Sublimation, Reactions, Reactions. భూమిలో రసాయన పరిణామం ఆకాశంలో రసాయన పరిణామం నీలో బుస్‌బుస్ గట్‌గట్.

వై : గట్‌గట్ ఏమిటి ? తూముకాల్వ లొడలొడ ధ్వనిలాగ.

మూ : I am the conquerer of the World ప్రపంచము నాది. హిహిహి ! నేనే ప్రపంచం- అడ్డువస్తాడా ఎవడేనా ? నా మజా యాటంబాంబు హిహిహి ! బుస్‌బుస్.

వై : నీకు ఒక్క నమస్కారము పెడతాను. యిక్కడినుంచి పో నాయనా!

మూ : I am flying, I am flying, హిహిహి (చేతులు పైకెత్తి) గాలిలో యెగిరిపోతా. మబ్బులమీద పరిగెడతా హిహిహి ! I am flying నేను ఎగురుతున్నాను.

వై : ఎగురు, ఎగురు ! ఎగిరి క్రిందపడు. చైనావాడిలా ఏం మిడిసి పడిపోతున్నావు !

మూ : హిహిహి Reactions, Reflections, Atombomb, Cosmicray, Airplane, Light, Heat, Electricity, Magic Reactions. బుస్ బుస్ బుస్. (నిష్క్రమణ)

వై : అమ్మయ్యా బ్రతికేనుర్రా బాబు ! ఇందాకటినుంచి ఒక చేగోల! ఒకచే గోల ! చంపేస్తున్నారు..............ఇంకా ఎంతసేపని యిక్కడ వుండను. ఈ పిచ్చిముండావాళ్ళు నా వెంటబడుతున్నారు. ఆ కషాయంగారిని బ్రతిమాలుకొని ఐనా పోవాలి యింటికి. (నిష్క్రమణ)

(భిషగ్రత్న, బ్రహ్మాంకవి ప్రవేశము)

భి.క. : ఓహో ! అలాగా ; మీరు శాస్త్రిగారి స్నేహితులా !

బ్ర : మరేనండి ! మాశాస్త్రి యీమధ్య తప్పుడుపని ఒకటి చేశాడు.

భి.క. : పాపం ! రెండు "కషాయముండ్లు" వేసుకుంటే బాగుండేది. మనస్సులో ఉల్లాసం కల్గుతుంది. ఇకముందు అటువంటి తప్పుడు కార్యాలు చెయ్యడు.

బ్ర : అదికాదండీ! వాడికి భావోద్రేక దేవత ప్రభావం పూర్తిగా అర్థంకాలేదు.

భి.క. : మీరు పొరబడుతున్నారు. మా "కషాయముండ్లు" మీ భావోద్రేక దేవతకుకూడ ఉల్లాసమిస్తాయి.

బ్ర : మా భావోద్రేక దేవతకు మందిచ్చారా మీరు ఎప్పుడైనా?

భి.క. : అవును మొన్ననే రెండు పొట్లాలు కావాలంటే టపాలో పంపించాను.

బ్ర : అల్లాగాండి! అయితే మా భావోద్రేక దేవత ఏవూరిలోవుంది యిప్పుడు ?

భి.క. : ఏమో! అదిమాత్రం నాకేమితెల్ల [illegible] పంపించేస్తు [illegible] కావాలంటే.

బ్ర : నిజమేనండి! నాకూ అల్లాగే భావో[illegible]దేక దేవత ప్రానుతుందిగాని ఎక్కడ నుంచివస్తుందో ఎల్లావుం[illegible]దో నాకు తెలియదు.

భి.క. : అవునులెండి! ఇంతకీ మీ శాస్త్రి చేసిన [illegible]

బ్ర : చెప్తా. మరచిపోయాను ఆ మాట! వైకుంఠంబాబుగార్కి నేను మంత్రోపాసనచేస్తే అది ఆయన మితిమీరి పఠించడంమూలాన ఉద్భృతం హెచ్చింది. అది తెలియక ఆయనకు పిచ్చి ఎక్కిందని యిక్కడ చేర్పించారట.

ఖి.క. : అవునండి! ఆయనకు నిజంగా పిచ్చి ఎక్కింది.

బ్ర : అదికాదండి! అది అంతా భావోద్రేక దేవత ఉద్రేకము.

ఖి.క. : మీరు అల్లా మాట్లాడుతున్నారేమిటి? నాడి చూడనీయండి! పిచ్చి ఎక్కినట్టుగా వుంది (చెయ్యి చూస్తు) అబ్బ! యీ మహా ప్రపంచంలో అందరూ పిచ్చివాళ్ళలాగే వున్నారే!

బ్ర : (చెయ్యి విదిల్చుకొని) చాలులెండి! నాకు పిచ్చి ఏమిటి? మీకు గాని భావోద్రేక దేవత ఆవేశించ లేదుగదా? (మొహంలోకి చూస్తూ).

ఖి.క. : అటువంటి దేమీ లేదులెండి? మీకు కొంచెము పిత్తం, వాతం, శైత్యం హెచ్చయినవి. రెండు "కషాయముండ్సు" వేసుకొని, యీవేళ భోజనం మానెయ్యండి.

బ్ర : అదిగో! మీకు భావోద్రేకము పుడుతూంది.

ఖి.క. : (మాత్రలు యిస్తూ) పుడుతుంది! బాగా ఉల్లాసం పుడుతుంది! వేసుకోండి రెండు మాత్రలు!!

బ్ర : ఆ వైకుంఠంగారిని మీరు విడుదల చేస్తారా లేదా? లేకపోతే మీ మీద పెద్ద కావ్యం వ్రాస్తాను.

ఖి.క. : వ్రాయండి ! నా పేరు చిరస్థాయిగా వుంటుంది ! నేను మీకు రెండు కషాయముండ్సు బహుమతిచేస్తాను. వ్రాసేటప్పుడు వేసుకోండి. మంచి ఉల్లాసం కలిగిస్తాయి ! అన్నట్లు, కృతికూడ నాకే యిప్పించండి సుమీ ! !

మీరు వైకుంఠంగారిని వదులుతారా లేదా ?

: వదిలేసైమన్నారా ? ఆయనకు యింకా పిచ్చి వుందేమో !

బ్ర : ఆయనకు అది పిచ్చే కాదు. భావోద్రేక దేవత ప్రభావం !

ఖి.క : ఓహో ! అయితే వదిలేస్తాను, యీ సాయంత్రమే !

బ్ర : చిత్తం ! అప్పుడప్పుడు మీకు నా కవితాధార కొంచెం కొంచెం రుచిచూపిస్తానులెండి !

ఖి.క : అల్లాకాదు ! చాలా చాలా రుచిచూపించాలి నాకు; లేకపోతే తృప్తి లేదు.

బ్ర : అయినా ప్రయత్నిద్దాము; భావోద్రేకము కలుగుతే సరి !

ఖి.క : తప్పకుండా కలుగుతుంది. రెండు 'కషాయముండ్సు' మాత్రలు యిస్తాను భావోద్రేక దేవతకు నేనిచ్చేనని చెప్పండి.

బ్ర : ఆ దేవత నాకు కనిపించదండీ !

ఖి.క : ఫరవాలేదు యీసారి కనిపిస్తుంది.

బ్ర : చిత్తం ! అలాగేలెండి !

(వైకుంఠం ప్రవేశం)

వై : ఏమయ్యా! కషాయంగారూ, నాకు పిచ్చిలేందే పిచ్చి అంటా రేమిటయ్యా! ఇంత సేపు ఆ పిచ్చివాళ్ళతో బాధపడలేక చచ్చాను. యింకా ఎంతకాలమయ్యా! నన్ను యింటికి పోనిద్దు బాబూ! పుణ్యముంటుంది. మా వేణు నాకోసం యెదురు చూస్తూ వుంటుంది కూడా! ఉస్ రామచంద్ర! ఏం పిచ్చిరా ఏం లోకంరా!

అదుగో! బ్రహ్మాంకవిగా రిక్కడే వున్నారు! ఏమిటయ్యా? మహాప్రభూ! నీ మంత్రం పఠించుకుంటూంటె పిచ్చి అంటా రేమిటయ్యా! నువ్వేనా చెప్పుదూ నా కర్మంకాలిపోనూ!

బ్ర : వైకుంఠంబాబుగారూ! నేను సర్వము మీ గురించి కషాయం గారికి మనవిచేశాను! యీ సాయంత్రమే మీకు విడుదల.

వై : హమ్మయ్య! బ్రతికించారు బాబు కవిగారూ!

ఖి.క : మీ నాడి చూడనీయండి ఒకసారి! చాల జోరుగా మాట్లాడు తున్నారు.

వై : ఇంకా నాడి ఎందుకయ్యా; ఇది పిచ్చి కాదంటూంటె.

ఖి.క : అలా పనికిరాదు. చూడనివ్వండి. లేకపోతే మిమ్మల్ని వదలను,

వై : చచ్చానురా దేముడా! అయితే చూడండి.

ఖి.క : ఊఁ! తగ్గిందిలెండి పిచ్చి! పిత్తం, వాతం, శైత్యం అన్నీ తగ్గాయి. యింటికి గూడ రెండు మాత్రలు యిస్తాను పట్టుకు వెళ్ళండి!...ఆ పిచ్చివాళ్ళతో మీరు యింతకాలము వుండ్డ,

బట్టి మీ భావాలు వారిలోను, వారి భావాలు మీలోను ప్రస రించి పిచ్చి నయంచేశాయి.

వై : చిత్తం నన్ను పోనీయండి యింటికి.

ఖి.క : ఇప్పుడు కాదు; సాయంత్రము ఒక ఔన్సుడు మోతాదు కషాయం పుచ్చుకొని వెళ్ళండి.

వై : ఇంకా తప్పలేదురా బాబూ! నాకీ కషాయం బాధ! బ్రహ్మాంకవి గారూ ! ఏమిటండీ యీ అవస్థ.

బ్ర : ఏదో కొద్దికాలమే ! కొంచెం ఓపికపట్టండి! అన్నట్లు నామంత్ర ప్రభావం ఎంతవరకూ వచ్చిందండి ! ఏమన్నా ఫలించిందా ?

వై : చిత్తం ! మహాదివ్యంగా ఫలించిందండి ! నేను యీ మంత్రం పఠిస్తూంటే నిజంగా మా వేణుకు తిక్క పూర్తిగా పోయిం దండీ !

బ్ర : ఇంటికివెళ్ళి తిరిగి దానిని పునఃపఠనచేయండి ! సత్ఫలితమిస్తుంది.

వై : చిత్తం మా వేణు చాలా మంచిదిలెండి, చాలమంచిది.

బ్ర : కషాయంగారూ ! మఱి సెలవా నాకు ! సాయంత్రం వైకుంఠం గారిని పంపించండి యింటికి.

ఖి.క : చిత్తం ! నా "కషాయముండ్సు" పట్టుకువెడుతున్నారా ?

బ్ర : చిత్తం ! పట్టుకువెడుతున్నానండీ. (నిష్క్రమణ)

ఖి.క. : కూర్చోండి! మరో రెండు మాత్రలు వేసుకోండి.

వై : తప్పదటండీ ! యింకా ఎంతసేపు కూర్చోవాలండి. ఏంపాపం చేసుకొన్నానురా దేముడా ? (కూర్చొనును)

ఖి.క : ఈ సాయంత్రందాక బాధపడండి మరి. యింకా కొంచెం పిచ్చి వుందిగా మరి ! భేషో భేషజం న్నామనారాయణే వైద్యం! కషాయం ! (కల్వంనూరుతూ)

—తెర—

## ఐదవ రంగము

(వేణమ్మగారి యింటిముంగిలి ! బ్రహ్మం, శాస్త్రి ప్రవేశము)

బ్ర : శాస్త్రీ ! ఇది ఒక్కటేనోయి నీ దగ్గరి తెల్వితక్కువ గుణం.

శా : అదేమిటండోయి ! కషాయంగారి 'కషాయముండ్సు' వేసుకున్నాముగా ! ఉల్లాసం పుడుతూంటే తెల్వితక్కువ అంటారేమిటి ?

బ్ర : అది కాదోయి ! నీకు భావోద్రేక దేవత ప్రభావము పూర్తిగా తెలియలేదు.

శా : మీరు నాకు పూర్తిగా చెప్పలేదు.

బ్ర : అందుకే విను, భావోద్రేక దేవత ప్రభావము తెలియకపోవడం మూలాన పాపం. అనవసరంగా వైకుంఠంగార్కి పిచ్చి ఎక్కిందని, ఆ వైద్యాలయంలోనికి చేర్పించావు. ఆయన చాల బాధ పడుతున్నాడు.

శా : అదేమిటండీ ! ఆయనకు పిచ్చి ఎక్కుతుందని జాతకంలో వుందే!

బ్ర : జాతకంలో వుంటే వుంటుంది గాని, భావోద్రేక దేవత ఆవేశించినప్పుడు మాత్రము పిచ్చి ఎక్కదు.

శా : అల్లాగటండీ ! అంటే ఆ దేవత మహాగొప్పదన్నమాట ?

బ్ర : అవునా మరి; అందుచేత వైకుంఠంగారిని యీ సాయంత్రము విడుదలచేయమని భిషగ్రత్న కషాయంగార్కి చెప్పాను. ఆయన మహాఉద్దండుడు సుమీ !

శా : ఆయన ఒప్పుకున్నారా లేదా ? యింతకీ.

బ్ర : ఊరికే ఒప్పుకుంటాడు ? నా భావోద్రేక దేవతను ఆయనలో ప్రవేశపెట్టించి ఒప్పించాను.

శా : అల్లాగటండీ ! మీ దేవత పరకాయప్రవేశము కూడ చేస్తుందన్నమాట.

బ్ర : అన్నమాట ! యిక చెప్పబోయేదేమిటంటే, నేను కూడ ఒక పొరబాటు చేశానోయి.

శా : అరరే: పాపం మీలాంటి పెద్దకవులు పొరపాటు చేస్తారటండీ ? అబ్బే ! మీరు పొరపాటు చేయరండీ ! మీ జాతకంలో కూడా అల్లాగే వుందిగా.

బ్ర : ఎంతమాట. మీరు నా మీద ప్రేమకొలది అల్లాగ అంటున్నారు గాని పొరపాటుపడుట అన్నది మానవునికి సహజగుణం.

శా : సరే ! ఇంతకీ మీ పొరబాటు ఏమిటి ?

బ్ర : నేను వైకుంఠంగార్కి ఒక్కడికే యీ మంత్ర ప్రభావము ఉపదేశించాను. కాని ఆయన ఎవరిమీద ఆ మంత్రం ప్రయోగింప దలచుకున్నారో వారికి మంత్రం సంగతి తెలుపలేదు. అందు

చేత ఆయన భార్యగారికి కూడ కొద్దిగా ఉపదేశిస్తే యీ మంత్రం పరస్పరంగా విజృంభించి సత్ఫలితాన్ని యిస్తుంది.

శా: నిజమేనండి! జ్యోతిషంలో కూడ పరస్పరంగా రేఖలు విజృంభిస్తేనేగాని ఆనందం, సత్ఫలితం యివ్వవంటారు.

బ్ర: చూశారా! ఆ కారణముచేతనే ఆయన భార్యగారు అది పిచ్చి అని భ్రమపడ్డారు.

శా: అబ్బే! అది నేనే చెప్పానండీ! ఆవిడ కేమీ తెలియదు.

బ్ర: ఆం చే! మీరు పొరబడ్డారన్నమాట.

శా: మానవుడు పొరపడటం సహజంకదండీ.

బ్ర: సరే ఇప్పుడు ఆయన భార్యగారిని మీరు పిలవండి. పిలిచి నేను ఫలానా వారినని చెప్పండి ఆవిడతోటి. అప్పుడు నేను మంత్రం ఉపదేశించి వైకుంఠంగార్కి ఆనందంకలిగిస్తాను.

శా: (ఇంటివైపు వెళుతూ) అలాగేనండి!

బ్ర: ఏమండీ! మీరు ఆవిడను పూర్తిగా ఎఱుగుదురా; కొంపదీసి పరాయివాళ్ళను పిలిచారు కనుక! ఆ మంత్ర ప్రభావం తిరిగి నన్నే తిరగకొడుతుంది.

శా: ఎంతమాటన్నారు; ఆవిడను నేను పూర్తిగా ఎఱుగుదును. ఆవిడ పేరు వేణమ్మగారు. ఆవిడకూ నాకూ చాలా స్నేహం లెండి. (వెళ్ళును.)

బ్ర: స్నేహమంటాడేమిటి? పోనీ మనకెందుకు ఎవరు ఎలా ఉంటేనో! ఏమైనా! వీరిద్దరు కూడబలుక్కుని వైకుంఠంగార్కి పిచ్చి ఎక్కిందని తిరిగి ఆసుపత్రిలో చేర్చరుగదా? అప్పుడు నా మంత్రం

ఎలా ఫలిస్తుంది! అయినా అంత దారుణం చేస్తాడా మా శాస్త్రి! ఈ మంత్రం ఆవిడకు బోధచేసి శాస్త్రిని నా దగ్గరే వుంచుతాను అది ఫలించేవరకు.

శా : వేణమ్మగారూ ! వేణమ్మగారూ !

వే : (లోపల విసుగుతో) ఎవరండి వారు ! అస్తమానం తలుపు తీయడం, వేయడం, విసుగెత్తిపోతుంది బాబు ! (బయటికి వచ్చి) ఓహో మీరాండి ! (ఏడుస్తూ) ఎలావున్నారండీ మా వైకుంఠంగారు ! పిచ్చి యింకా తగ్గలేదండీ ?

శా : ఇల్లారండీ ! అన్నీ చెబుతాను. (బ్రహ్మంను చూపి) ఈయన ఫలానావారండి.

బ్ర : ఛ ఛ! ఫలానావారంటావేమిటి? సరిగా చెప్పు: నే చెప్పినవన్నీ మరచిపోయావా ?

వే : ఇదేమి భాగోతమండీ ! (ఆశ్చర్యముగా).

శా : అబ్బే ! ఏమీ లేదండి ! ఈయన బ్రహ్మంకవిగారు, మీ కోసం వచ్చారు.

బ్ర : అవునండి ! నేను మీకోసమే వచ్చాను.

వే : మిమ్మల్ని ఎఱగనే నేను ? నేనెందుకండి.

బ్ర : మీరు వైకుంఠంగారి భార్యగారేనా ?

వే : అవునండి.

బ్ర : నేను వైకుంఠంగార్కి కవిత్వానికి సంబంధించిన ఒక భావోద్రేక మంత్రము ఉపదేశించానండి ! ఇది చూచి మీరు పిచ్చి అని భ్రమపడ్డారు.

వే : మీరేనటండీ ! అలా పిచ్చి ఎక్కించారు మా వైకుంఠంగార్కి !
ఇదేనాండి పెద్దమనిషితనం అంటే !

బ్ర : అందుచేత ఆయనను విడుదలచేయమని కషాయంగారికి
చెప్పాను! వైకుంఠంగారు ఇంక కొద్దిసేపటిలో యింటికివస్తారు.

వే : పోనీలెండి బ్రతికించారు నన్ను! మీ మేలు మరువలేనండన్నయ్య
గారూ !

బ్ర : ఆఁ! దానికేమిలెండి! చూశారూ! మీతో ఒకసంగతి చెపుదామని
వచ్చాను.

వే : ఏమిటండి?

బ్ర : వైకుంఠంగారికి చెప్పిన భావోద్రేక మంత్రం మీకుకూడ చెబుదా
మని వచ్చాను.

వే : నాకెందుకండి ఆ మంత్రం?

బ్ర : అలాగనకండి మరి; వైకుంఠంగారు ఆ మంత్రం పఠిస్తుంటే ఆ
సంగతి మీరుకూడా గ్రహించుకునేందుకు.

వై : గ్రహించుకుని?

బ్ర : గ్రహించుకుంటే అది పిచ్చి అనుకోరు.

వే : అల్లాగయితే చెప్పండి! మావారు బాగుండడమే నాకు
సంతోషం.

బ్రః : ఆయన మంత్రం పఠిస్తుంటే, వారిలాగే మీరుకూడా కవిత్వము
చదవాలి.

వే : ఆ కవిత్వము నాకేలా చేతనవునండీ! నాకురాదు.

బ్ర : వచ్చేదేమిటి? చదివేయండి! వైకుంఠంగారు ఏమి మాట్లాడుతే అదే మీరు వల్లించండి.

వే : ఊ వల్లించిన తరువాత?

బ్ర : తరువాత! అంతే! వల్లించుతే వారిభావాలుమీరు మీభావాలు వారు గ్రహించుకుంటారు. అప్పుడు ఆయనకు పిచ్చి ఉండనే ఉండదు

వే : అల్లాగే లెండి; అన్నయ్యగారూ! మరియేదో మంత్రం చెబుతా నన్నారు?

బ్ర : ఇదే మంత్రం. ఇంకేముంది?

వే : మంత్రం అంటే ఊరికే మాట్లాడటం అన్నమాట.

బ్ర : మరేనండి! అంటే ఘాటుగా మాట్లాడాలి అన్నమాట. మీరు ఆ మంత్రం వల్లించేటప్పుడు ఆ మంత్రం మీకు అనుగుణ్యంగా వుండేటట్టు మాట్లాడాలి. వైకుంఠంగారు త్వరలో వస్తారు. మరి సెలవా మాకు?

వే : మంచిది, వెళ్ళిరండి అన్నయ్యగారు! (శాస్త్రి, బ్రహ్మం నిష్క్రమణ)

వే : ఇంకేముంది ఆయనకు పిచ్చి తగ్గిపోయింది, యింక నన్ను పిచ్చి వాడిపెళ్లాం అని అనరు! దేముడా! నే అన్నప్రకారం తిరుపతికి వచ్చి నీదర్శనం చేసుకుని మొక్కు చెల్లించుకుంటాను దేముడు మహామంచి వాడు; అందరినీ రక్షించుతాడు.

(కషాయం, వైకుంఠం ప్రవేశము)

ఖి.క. : ఇదేనా మీ యిల్లు ? మఱి నేవెళ్ళివస్తాను. జాగ్రత్త సుమండీ! మీకు పిచ్చి పూర్తిగా తగ్గిపోయింది. రెండు "కషాయముండ్సు" వేసుకోండి ! ఉల్లాసం కల్గుతుంది మనస్సులో ! మఱి సెలవు. (విష్క్రమణ)

వై : హమ్మయ్య ! కషాయంబాధ వదిలింది, పిచ్చివాళ్ళ గొడవ తగ్గింది. ఇంక మంత్రం పునః పఠనజేస్తా. ఈ సారితో పూర్తిగా మా వేణుకు తిక్క తగ్గితీర వలసిందే. మునుపే కొంచెము తగ్గిన సూచనలు కనిపించాయి.
బ్రహ్మాం, కవిబ్రహ్మాం, భావోద్రేక దేవతా, బ్రహ్మాం ! ఇదిగో మా వేణు యిక్కడేవుంది. వేణూ ! వేణూ !

వే : వచ్చారాండి ! మీకోసమే యెదురుచూస్తున్నాను; పిచ్చి నయమైనదాండి !

వై : పూర్తిగా తగ్గిపోయింది...ఇకనే ! ఇంత బాగా మాట్లాడు తోంది మా వేణు ! మంత్రం పునఃపఠన చేస్తాను. బ్రహ్మాం, బ్రహ్మాం భావోద్రేక దేవతా ! నాలో ప్రవేశింపుము. ఓహోహో ! ప్రేయసీ !

వే : అంటే నేను కూడ మంత్రం తిరిగి పఠించాలన్నమాట.

వై : ఓ కోమలీ ! ప్రియా నీ వెంత సౌందర్యముగా యున్నావే.

వే : ప్రియా ! మీ రెంత సౌందర్యముగా యున్నారో.

వై : నీ హృదయ మెంత ప్రేమపూరితమే చెలీ!

వే : మీ హృదయమెంత ప్రేమపూరిత మో!

వై : (ప్రక్కగా) ఇంకేముంది! నా వేణు పూర్తిగా నయం.

వే : వైకుంఠంగారు చాలనయం యిప్పుడు.

వై : పడతీ! ప్రణయకలహామిక మానితివా!

వే : ప్రియుడా! ప్రణయకలహామిక మానితిరా!

వై : సంసారములో సుఖములు కలుగునుగా!

వే : సంసారములో సుఖములు కలుగునుగా!

వై : వేణూ! వేణూ! చూశావా! నాకు చాలా సంతోషముగా వుంది ఈవేళ.

వే : నాకూ సంతోషంగానే వుందండి.

వై : మా వేణు చాలమంచిది మా వేణు చాలమంచిది; అప్పుడప్పుడు తిక్కవస్తూంటుంది అంతే; ఇప్పుడు అదీలేదు.

(బ్రహ్మం, కషాయం, శాస్త్రి ప్రవేశము.)

బ్ర : వైకుంఠం బాబుగారు ! నమస్కారాలు. ఎప్పుడు వచ్చారు ఆసుపత్రినుంచి?

వై : నేనాండి! ఇప్పుడే వచ్చేను. మీ మంత్రం బాగా ఫలించిందండి. ఆహాహా! ఏం మంత్రం ! ఏం మంత్రం! మీకు చాలా కృతజ్ఞుణ్ణండి.

వే : బ్రహ్మం అన్నయ్యగారూ నమస్కారము. మీ మంత్రము బాగా ఫలించిందండి.

బ్ర : చూశారా! నూ మంత్ర ప్రభావం బహు తీక్షణంగా పనిచేస్తుంది తెండి.

శా : అదేమిటండీ! ఇదంతా నా జ్యోతిష ప్రభావం. జ్ఞాపకంలేదూ, ఆ వేళచెప్పాను,మీకు సంసారం నిండా ఆనందమయం అవుతుందని!

భి.క. : అదేమిటండోయి! ఇదంతా నావైద్య ప్రభావం. పూర్వం వైకుంఠంగార్కి పిచ్చేగా! నా "కషాయముండ్సు" వల్ల బాగా ఉల్లాసం కలిగింది. అందుచే సంసారం బాగుపడింది.

వై : బ్రహ్మాం కవిగారూ. మరి సెలవా? మీకందరికి నా నమస్కారాలు. మళ్ళీ కలుసుకుందాం.

వే : వెడతానండీ శాస్త్రి అన్నయ్యగారూ.

(వేణు, వైకుంఠం నిష్క్రమణ)

శా : ఆహాహా! ఏంజ్యోతిషం! బలేబాగా పనిచేసింది!

భి.క. : ఆహాహా! "కషాయముండ్సు" ఉల్లాసం కలిగించి చాల భేషుగ్గా పనిచేసిందే.

బ్ర : ఆహాహా! భావోద్రేక దేవతా! నీ ప్రభావము వర్ణనాతీతంబే! నిన్నుచూస్తే నాకెంతో ముద్దువేస్తోంది! ఒక ముద్దియ్యావు నాకు?

శా : ఆహాహా! ఎంత పనిచేసింది నా జ్యోతిషం.

భి.క : ఆహాహా! ఎంతపనిచేశాయి! నా "కషాయముండ్సు?"

బ్ర : ఆహాహా! ఏం ప్రభావం! ఏం ప్రభావం!

భావోద్రేకత ప్రభావమంతా ప్రయోగంబులో చూపిస్తా!
భావములన్నియు మూటలుగట్టి బంతులవోలికి విసిరేస్తా భా.
ప్రకృతివన్నెలు ప్రమదల సొగసులు! భావోద్రేకత ప్రధానస్థానాల్
సంహారంబులో నసాధ్యమంతా సాధ్యంచేసే భావోద్రేకత! భా.

(శాస్త్రి, భిషగ్రత్న, బ్రహ్మాం నిష్క్రమణ).

—: తెర :—

సమాప్తి

## ఇందులోని పాత్రలు

1. సూర్యారావు .... వ్యాపారి
2. రంగడు .... జూదగాడు
3. సావిత్రి .... విద్యార్థిని
4. పరమేశం .... గుమాస్తా
5. సత్యం .... విద్యార్థి
6. రాముడు .... బూట్ పాలిషర్ — కుర్రాడు

[రంగడు ముడుతలుపడిన నల్ల పైజమా, ఎర్రచార్ల బనీను, మఫ్లర్ ధరించి, పార్కులో ఒక తిన్నెపై కూర్చుంటాడు. కత్తితో చేతిలోని జామిపండు కోస్తూ తింటూంటాడు. రేగిన జుట్టు, ఎర్రని కళ్లు, నూనెకారే ముఖం, తిన్నెమీద పేకముక్కలు. అత డొక జూద గాడని తెలియపరుస్తోంటాయి. పండు నములుతూ ఒక్కొక్కసారి పేక ముక్కలు చేతితో త్రిప్పిచూస్తుంటాడు. తిన్నె పక్కనే గొలుసుకట్టిన చిన్న కుక్కపిల్ల.

సూర్యారావు—పంచ, రంగుకోటు, నెరిసిన జుట్టు, చేతిలో కర్ర, ఆకుచెప్పులు.]

సూర్యా: (ప్రవేశించి రంగడివైపు కోపంతో చూస్తాడు) ఏయ్! ఎవరు నువ్వు?

రంగడు: (సూర్యారావును తీవ్రంగా చూసి గట్టిగా నవ్వి తల దించు కుని మౌనం వహిస్తాడు.)

సూ: నిన్నే?

రం: విన్నా.

సూ: సమాధానం చెప్పవేం?

రం: అనవసర మని.

సూ: ఆc, (చకితుడై) ఏం పొగరు?

రం: మాటలు జారుతున్నాయ్—మీకూ నాకూ సంబంధం?

సూ: (కోపంతో) బీరకాయపీచు సంబంధం.

రం: (గట్టిగా నవ్వి) సంబంధాలు అర్థంచేసుకోగలరన్నమాట!
[ఒక్క క్షణం నిశ్శబ్దం. హెచ్చుతున్న కోపం తగ్గించుకుంటాడు సూర్యారావు]

సూ : ఇక్కడినుంచి లేవాలి.

రం : ఏం ?

సూ : పమంది.

రం : ఏం పని ?

సూ : అది నీ కనవసరం.

రం : అయితే లేవను.

సూ : చాలా పొగరుగా మాట్లాడుతున్నావే ?

రం : (నవ్వేసి) పొగరు నా జన్మహక్కు—ఇది ప్రజలకోసం కట్టిన పార్కు. నీ తాతగారి తోట కాదు.

(సూర్యారావు నెమ్మదిస్తాడు)

సూ : చూడు బాబూ! నీమాట నిజమే...కాని ఈ స్థలంలో ఒక పెద్దమనిషితో కొన్ని విషయాలు మాట్లాడాలని నిర్ణయించుకున్నా—అందువల్ల నువ్వు పార్కులో మరోచోటికి పోవాలి. ఇక్కడ ఉన్నంత రహస్యంగా ఏమూలా లేదు—అందుకని....

రం : ఓహో! రహస్య విషయాలు మాట్లాడుకోవాలన్నమాట... ఇంట్లో మాట్లాడుకోలేకపోయారా ?

సూ : అదికుదరకే యిక్కడికి వచ్చాను.

రం : ఏం? భార్య గయ్యాళా? —అతిథులనా గెంటేస్తుందికాబోలు.

సూ : (కోపంతో చీదరించుకొని సర్దుకుంటాడు) అదికాదు. నామాట వింటూ, నా బాబువుకదూ? మంచివాడవు.

రం : మీవ దేవ్యాపారం?

సూ : వెండి బంగారాలు,

రం : అబ్బో! బాగా ధనవంతులన్నమాట

సూ : (ఆనందంతో కులుకుతాడు)

రం : రహస్యం మాట్లాడాలంటున్నారు ? ఎవరి కొంపైనా ముంచుతారా ?

సూ : (చిరాకుగా) అవన్నీ నీకెందుకోయ్ !

రం : నల్లబజారులో వెండి బంగరాల కాంతి నింపుతారా ?

సూ : మంచిగా మాట్లాడుతున్నానుకదా అని మదురెక్కుతున్నావు.

రం : పరదేశాలకు దొంగతనంగా ఎగుమతిచేస్తారా ?

సూ : ఏమయ్యోయి! మితిమీరి మాట్లాడుతున్నావు !

రం : (మౌనంగా జామిపండు తింటూంటాడు)

సూ : ఆ పెద్దమనిషి వచ్చేవేళయింది....మరి నువ్వు వెళాలి.

రం : ( కుక్కపిల్లవైపుచూసి ) దాన్ని అడగండి. హల్లో ! లిల్లీ ! ఏమంటావు?

సూ : (కుక్కవైపు సరదాగా నవ్వుతూ చూస్తాడు)

రం : వెళ్లనంటూంది కుక్కపిల్ల

సూ : (ముఖం మాడిపోయి గుటకలు వేస్తాడు) మరి....మరి....మరి....

రం : మరా?

సూ : (నవ్వేసి జేబులోంచి పర్సు తీస్తాడు)

రం : ఓహో! వ్యాపార సరసం మొదలెట్టారన్నమాట!

సూ : మరేంలేదు. ఈ రూపాయి తీసుకో.

రం : (నవ్వుతూ) ఒక్కరూపాయే?

సూ : పోనీ మరొకటి. (ఇస్తాడు)—టైం ఆట్టేలేదు. ఇంకో అర గంటలో ఆ పెద్దమనిషి మళ్ళీ రైలు కందుకోవాలి....చాలా విషయాలు మాట్లాడుకోవాలి....నువ్వు వెళ్ళాలి....

రం : భేష్—బాగుంది— ఇవేళ మంచి లాభం—(రూపాయిలు జేబు లోకి నెట్టుతాడు) నేను మీ వ్యాపారంలో ఏమైనా సహాయం చెయ్యగలనా ?

సూ : తప్పకుండా. నా రహస్యాలు నీకు తెలిసిపోయాయి....నీ సహాయం కావలిస్తే నే అడుగుతాగా !

రం : అయితే ప్రస్తుతం అక్కర్లేదన్నమాట.

సూ : కావాలి.. .కాని....

రం : నసగకండి....రూపాయి లిచ్చారుగా ! నేను మీ వాణ్ణే యింక.

సూ : అవును ! అది తెలుస్తోనే వుందిగా—ఒక గుమాస్తా కావాలోయి నాకు.

రం : నేను పనికిరానూ ?

సూ : నువ్వు చదువుకున్నావా ?

రం : ఓ ! స్కూలుఫైనలుదాకా చదివాను.

సూ : ఎక్కడైనా పనిచేశావా ?

రం : గుమాస్తా పనులు చాలా చేశాను.

సూ : పద్దులు రాయగలవా ?

రం : రాయగలను.

సూ : పద్దులు అంటే....నీకు తెలుసుగా—నే చెప్పాలా ?

రం : అదే అదే. ...దొంగపద్దులు !

సూ : (నవ్వేసి) గట్టిగా అనబోకోయి!—సరే—తీసుకుంటాను గుమాస్తాగా. అయితే ఎక్కడుంటున్నావు నువ్వు ?

రం : ఆ దూరాన కనిపించే గుడిసెల్లో !

సూ : అదేం ఖర్మ ! నీ తల్లిదండ్రులు ఏంచేస్తున్నారు ?

రం : తండ్రి ద్రోహి ! తల్లి కులట ! ఎవరివల్ల ఎవరు అలా అయ్యారో మాత్రం తెలియదు.

సూ : ఆఁ. (ఆశ్చర్యం తగ్గించుకొని) అయితే వాళ్ళు వదిలేశారన్న మాట నిన్ను ! పాపం !

రం : లేదు—నేనే వాళ్ళని వదిలేశాను.

సూ : నీ వృత్తి ?

రం : దొంగతనం ! (నవ్వి) నా సరదాలు, త్రాగుడు, జూదం.

సూ : (కంగారుతో గాభరాపడి చేతికర్ర సర్దుకుంటాడు) ను....వ్వు... దొంగవా ? దొంగవా ?

రం : (గట్టిగా నవ్వి) ఆఁ...పట్టపగటి దొంగను! నీకన్న గజదొంగను! నీలాంటి రహస్య వ్యాపారులను దోచుకునే దొంగను.

సూ : అయితే - నే వెడతాను - వెడతా! (మెల్లిగా జారుతూ వెళ్ళిపోబోతాడు)

రం : (గంభీరంగా) ఆగు! ఆగు! (పారిపోయే సూర్యారావును కోటు కాలరు పట్టుకొని ముందుకు లాక్కువస్తాడు.)

సూ : ఏయ్...ఏయ్...పో...లీ...సు !

(రంగడు కత్తి సూర్యారావు పీకమీదకు ఎత్తుతాడు. సూర్యారావు భయంతో కేకలు మానుతాడు)

రం : నిన్నెందుకు పిల్చేనో తెలుసా?

సూ : తెలియదు...కాని నువ్వు మంచివాడవు.

రం : మరి పారిపోతావేం?

సూ : ఏ...ం...లేదు.

రం : నీ జేబులో డబ్బు ఎంతవుంది?

సూ : నా జేబులోనా?...ఏం లేదు...

రం : అబద్ధమాడకు...పొడిచేస్తా! (కత్తిచూపిస్తాడు)

సూ : (చేతులు అడ్డుపెట్టి) బాబ్బాబు! చంపకు...అయిదు వందలు.

రం : (జేబులోంచి తీసియిస్తాడు సూర్యారావు. అందుకుంటూ) అయిదు వందలు! (నవ్వి) లక్ష్మి పలికింది. దేనికైనా ప్రయత్నం చాలిగా! నువ్వు వెళ్ళవచ్చు.

సూ : (వెనక్కి అడుగు వేస్తాడు)

రం : ఆగు...(నవ్వి) డబ్బుకన్న తీపి అన్నమాట నీప్రాణం! నీ పాపపు ధనం నాకక్కర్లేదు – ఇది నీలాటి నీచప్రాణులకే అవసరం కూడా...తీసుకో - 502 రూపాయలు! (చేతులు దులుపుకొని) నావృత్తి దొంగతనంకాదు...దొంగతనం చెయ్యగలిగినా చెయ్య దల్చుకోలేదు.

సూ : (చెయ్యిచాచి భయంతో డబ్బు తీసుకుంటాడు)

రం : దొంగంటే భయం - కాదంటే హాయి. దొంగంటే అస్పృశ్యుడు కాదంటే స్నేహితుడు. కుళ్ళుసంఘం - కుళ్ళు బుద్ధులు. రహస్య వ్యాపారంతో ప్రజల్ని దోచుకుంటున్న నువ్వు దొంగవుకాదూ? ప్రజల పార్కులో ప్రజల్ని మోసపుచ్చే రహస్యాలు మాట్లాడు

కోడం దొంగబుద్ధికాదూ? దొంగ ఎందుకౌతాడో ఆలోచించావా ఎప్పుడైనా? దొంగా మనిషే!

సూ : ఆలోచిస్తా! (మెల్లిగా నిష్క్రమణ భయంతో)

రం : ఆలోచించు...జీవితాంతందాకా ఆలోచిస్తూండు - సమాజంలోని నాజూకు దొంగలు! (కత్తిపదును చూస్తుంటాడు)

సత్యం : (సూటు - నోట్లో సిగరెట్ కాలుస్తూ ప్రవేశం - సూర్యారావు వెళ్ళినవైపు చూస్తూ వస్తాడు)

రం : ఆ వెళ్ళిపోయే వ్యాపారస్థుణ్ణి మీ రెరుగుదురా?

స : (అనుమానం, భయం) మీరెలా ఎరుగుదురూ?

రం : నా రెండుకళ్లతో యిప్పుడే చూశాను. ఒక నిండుమనిషి మీరు కాదనగలరా?

స : ఏమో! అది మీకే తెలియాలి.

రం : ఇది నల్గురూ వచ్చేచోటు, వచ్చేవాళ్ళు వస్తారు, పోయేవాళ్ళు పోతారు. మేము మాత్రం కదలం. ఏమంటావు లిల్లీ... పోయినవాడితో నాకేం సంబంధం?

స : అయితే నీకేమీ సంబంధం లేదన్నమాట!

రం : (నవ్వి, అతని ముఖం పరిశీలిస్తూ) లేకేం ఉంది. లేదని వేళాకోళంగా అన్నా...

స : ఏం సంబంధం?

రం : అదే! నీకు తెలియదు? చస్తే దెయ్యం అవుతాడు. (నవ్వి గంభీరుడౌతాడు) కాదు, బ్రతికివుండి పీడించే దెయ్యం.

స : (అనుమానంతో) అతని పేరు?

రం : ఏమో నాకేం తెలుసు ?

స : సిగరెట్ కావాలా ?

రం : మీ దగ్గర ఎక్కువవుంటే ఒకటి యిలా పడేయండి....(కాలుస్తూ) ఒక్క సిగరెట్టు అందిస్తే ఎంత విరోధి ఐనా స్నేహితుడై పోతాడు.

స : మీరు నిజంచెప్పారు.

రం : షికారుకు వచ్చారా ?

స : అవును....కాదుకూడా!

రం : అయితే మీకూ ఏదో పనివుందన్నమాట - యీ పార్కులో - ఈ మూల.

స : మీరు నిజం చెప్పారు.

రం : నా సహాయం కావాలా?

స : అదే కోరుదామనుకుంటున్నాను.

రం : కోరండి.

స : మీరు యీ స్థలం ఖాళీచేసి కాస్సేపు దూరంగా వెళ్ళాలి.

రం : ఏం ?

స : మీరు మరోలా అనుకోకండి...నేను ఒక అమ్మాయిని ప్రేమించాను. మనసారా ప్రేమించాను. ఈవేళ నన్ను కలుసుకుంటానని ఒప్పుకుంది.... ఇక్కడే.

రం : ఓహో! మీరు ప్రియుడివేషం వేసుకువచ్చారన్నమాట.

స : వేషంకాదు. సత్యం చెబుతున్నా ఆమెను ఎంతో ప్రేమించాను. ఆమె చంద్రబింబంలాంటి వదనం, గండు తుమ్మెదల్లాంటి కండ్లు,

తామరతూడులా ఒయ్యారపు ఒంపు, అందాలు ఒలికే హంస గమనం, మలయపవనం రొదలా ఆమె సిల్కు చీర శబ్దం తళు కులు - కులుకులు....ఒక్కసారి పొందుతే జన్మతరిస్తుంది. మీకు ఏం కావలిస్తే అది యిస్తాను మీరు యిక్కడినుంచి వెళ్ళి పోవాలి.

రం: ఆ అమ్మాయిని చాలా ప్రేమించారన్నమాట.

స: నిజం. ముమ్మాటికి నిజం.

రం: మీ రేంచేస్తున్నారు ?

స: యం.బి.బి.యస్. చదువుతున్నా.

రం: పెళ్ళయిందా ?

స: కాలేదు.

రం: అందుకేనా యీ ప్రేమ తాండవం ?

స: నేను అందరిలాగా కాదు. నా హృదయం ఘోషిస్తున్నది.

రం: ఎవ రా అమ్మాయి ?

స: ఇప్పుడే ఇక్కడికి వచ్చారు కదూ ! సూర్యారావుగారు, ఆయన కూతురు సావిత్రి !

రం: (గంభీరంగా) వ్యాపారి సూర్యారావు యిప్పుడు వెళ్ళిపోయిన మనిషేనా ?

స: అవును.

రం: తెలిసింది కాదు మునుపు. పొడిచేసేవాణ్ణి. (కత్తిమీద చెయ్యి వేస్తాడు.)

స: (వణికిపోతాడు)

రం : (సర్దుకుని) ఏం లేదు....ఓహో ! వారి అమ్మాయిని ప్రేమించారా ?

స : మామూలుగా ప్రేమించలేదు....కొన్ని రాత్రులు ఆమెను తల్చుకుంటూ నిద్రపోలేదు.....హృదయంలో ఏదో ఉపద్రవమైన బాధ ! తియ్యని కలలు ! ఎన్నో ఊహాగానాలు ! ! మీరూ యువకులే కాబట్టి అర్థంచేసుకోగలరని చెబుతున్నా.

రం : మీకు నిజంగా సహాయంచేస్తాను.

స : మీ అంత మంచివారు లేరండి.

రం : ఒక్క రెండు రూపాయ లివ్వండి.

స : తప్పకుండా ! (యిస్తాడు)

రం : మీకోసం పూలదండలు తెస్తాను.

స : ఎందుకు ?

రం : నా సమక్షంలో పెళ్ళిచేస్తాను. ఇంత ప్రబలంగా ప్రేమించుకునే స్త్రీ పురుషులు పెళ్ళిచేసుకోవాలి.

స : మీ కెందుకా శ్రమ.....మేం చేసుకుంటాంగా ?

రం : కాదు. నా చేతులారా చెయ్యాలనిపిస్తోంది మీ పెళ్ళి.

స : నాకు నిజంగా ఆమెను పెళ్ళిచేసుకోవాలనిపిస్తోంది. కాని.....ప్రస్తుతం ఆమెను పెళ్ళిచేసుకోలేను.

రం : ఏం ?

స : ఇంకా చదువుకోవాలిగా !....పెళ్ళయితే పరీక్షలు ప్యాసవద్దూ?

రం : భలే మోసం.....ప్రేమ నటించి దొంగతనంగా పార్కుల్లో ప్రేమ కలాపాలు నడిపిస్తే ప్యాసవగలరన్నమాట. తండ్రి చెమటోడ్చి పంపించిన డబ్బు నిర్లక్ష్యంగా ఖర్చుపెడుతూ కనిపించిన కన్యల

జీవితాలు పాడుచేస్తూంటే పరీక్షలు ప్యాసవగలరన్నమాట !
ప్రేమ పేరుతో దొంగతనంగా అవినీతిని పెంపొందిస్తే పరీక్షలు ప్యాసవగలరన్నమాట.

స : (జడిసి) మీరు ఏమిటేమిటో అంటున్నారు.

రం : నేను సత్యం అంటున్నాను .... అందుకే అది నీకు వెగటుగా వింతగా ఉంది .... నువ్వుచేసేది మోసంకాదూ ? దొంగబుద్ధి కాదూ ?

స : (నవ్వి) మీరు మరోలా అనుకోకండి,

రం : మరోలా అనుకోను. నీకు బలవంతంగా పెళ్లిచేయిస్తాను ఇప్పుడే. పద ! (చెయ్యి పట్టుకుంటాడు గట్టిగా)

స : ఆ అమ్మాయికి యిష్టం ఉందోలేదో కనుక్కోవద్దూ ?

రం : అది నా బాధ్యత...పద...సూర్యారావుగారింటికి వెడదాం.

స : ఇప్పుడుకాదు....నన్ను వదిలేయండి....ఇంకెప్పుడు ఈ పార్కుకు రాను. (చెయ్యి వదిలేస్తాడు)

రం : ఇష్టమైతే పెళ్లిచేసుకోవాలిగాని...ప్రేమపేరుతో ఆడవాళ్లను చెడగొట్టకు.

స : (కాలుస్తూ) సిగరెట్టుకావాలా ?

రం : అక్కర్లేదు. నీలాంటి నీచుడిచేతిలోంచి సిగరెట్టు తీసుకోడం నాకు సిగ్గుచేటు.

స : మీరు చాలా ఘటికులండి....సూర్యారావుగారి స్నేహితులేమో అని మొదటే అనుమానించాను .... అది ఇప్పుడు నిజమైనట్లు తేలింది.

రం : ఆఁ, సూర్యారావు నా స్నేహితుడా ? నా దృష్టిలోవున్న సూర్యారావు ఇతడే అయితే నరికేసేవాణ్ణి.

వ : ఆదేదో త్వరగా చేద్దురూ, మీకు పుణ్యం ఉంటుంది.

రం : అవును, నువ్వు ఆ అమ్మాయిని లేవతీసుకపోయి, తర్వాత జీవితాన్ని నాశనం చెయ్యడానికి వీలుంటుందిగా....అటువంటిది ఒక్కొక్కసారి నాకూ చెయ్యాలనే అనిపిస్తుంది....కాని నేను నీ అంత నీచుణ్ణి కాదుగా !

వ : అసలు విషయం ఏదో దాస్తున్నారు.

రం : చెబుతాను. నీకు పాఠం నేర్పుతుందికూడా. ఒక అమ్మాయిని యీ సూర్యారావు తన యౌవనంలో లేవదీసుకుపోయాడు. పెళ్లి చేసుకుంటానన్నాడు. ఆమె గర్భవతి అయింది, యీ ద్రోహి ఆమెను విడిచేశాడు. తన స్వార్థం, సంఘ మర్యాద నిలుపుకున్నాడు. కాని ఆ అమ్మాయిని కులటగా పరిగణించారు అంతా. సమాజం హీనంగా చూసింది. ఆమె కొడుకును రండ కొడుకన్నారు. దరిద్రుడివాలకంలో దొంగ అని అతణ్ణి ఈసడించారు. సమాజం క్రూరత్వంతో కుమిలిపోయి ఆ అమ్మాయి నిజంగా కులట అయింది. కులట తల్లితో కాలం గడపలేక లేచి పరారి అయ్యాడు ఆ కొడుకు. అతనే నేను. ఆ అమ్మాయే నా తల్లి....కాని (పండ్లుకొరుకుతూ) ఆమనిషే సూర్యారావో కాదో నిర్ణయించుకోవాలి....నిజమైతే నరికేస్తాను...కాని నువ్వుమాత్రం అటువంటి చావు కోరుకోకు...

వ : మీతో ఎక్కువ పరిచయం లేకపోయినా మీ విషయాలు నాకు చెప్పడం నాకు చాలా సంతోషం.

రం : (కోపం సర్దుకొని) ఒక సిగరెట్టు యిస్తారా ?

స : (యిస్తాడు)

రం : ఆ అమ్మాయిని మీరు పెళ్ళిచేసుకుంటానంటే ఉండండి. లేదా ఆ అమ్మాయిని మీరు ప్రేమించకుండా కామిస్తే వెళ్లిపోండి తక్షణం.

స : వెడతా......వెళ్లిపోతాను. ఆ అమ్మాయిని యింక ఒంటరిగా ఎప్పుడూ చూడను. నమస్కారం ! (నిష్క్రమణ)

రం : నక్క వినయం ! నవయౌవన మైకం ! కళ్ళుమూసుకు మసిలే కాముకులు. యౌవనం దోచుకునే దొంగలు !

[సిల్కుచీర - మల్లెపూలు - చేతిలో చిన్న బేగ్ - స్లిప్పర్లు - మెల్లిగా అడుగులు వేసుకుంటూ సావిత్రి ప్రవేశం. రంగడు జామిపండు తింటూ ఆమెను చూడకుండా వెనుకగా కూర్చుంటాడు.]

సా : (ఆనందంతో ఏదో కూనిరాగం తీసుకుంటూ రంగని చూసి గతుక్కున ఆగిపోతుంది—అనుమానంతో) సత్యం....సత్యం....

రం : (తిరిగి) ఆఁ. నా పేరు రంగడు. ఇదిమాత్రం సత్యం.

సా : (కంగారుతో వెళ్ళిపోబోతుంది)

రం : ఒక్క నిమిషం ఉండండి.మీరు చదువుకున్నారుగా! స్వాతంత్ర్యం, పురుషులతో సమాన హక్కులు, నాగరికత అన్నీ ఉన్న మీ లాంటి భారత వీర నారీమణులు భయపడతారా ?

సా : ఎవరు మీరు ?

రం : మీ పేరు సావిత్రి కదూ ?

సా : నన్నెలా ఎరుగుదురు ?

రం : కొందరిని అందరూ ఎరుగుంటారు. మీరు ఆ కోవకు చెందారు.

సా : సరేలెండి....ఇక్కడికి సత్యం అనే ఒకాయన వచ్చారా ?

రం : వచ్చాడు.

సా : వచ్చాడు అంటున్నారు....మీరు స్నేహితులా ?

రం : ఆఁ.... స్నేహితులయ్యారు.

సా : మీరు యిక్కడ ఉన్నారేం ఏమన్నా చెప్పమన్నారా ?

రం : ఆఁ. ఒక విషయం చెప్పమన్నాడు.

సా : (సిగ్గుతో)అయితే మీకు మా విషయం తెలిసిపోయిందన్నమాట.

రం : మరేం ప్రమాదం లేదుగా....తల్లిదండ్రుల లక్షణాలు సంతానానికి ఎంతవరకు వస్తాయా అని ఒక్కొక్కసారి ఆలోచించేవాణ్ణి. అది మీ విషయంలో చాలా నిజమౌతోంది.

సా : అంటే ?

రం : మీ నాన్నగారి లక్షణాలు మీలో బాగా కనిపిస్తున్నాయి.

సా : మా నాన్నగారిని ఎరుగుదురా ?

రం : ఎరుగుదును. చాలా మంచివారు.

సా : (చమత్కారంగా) అయితే మీ ఉద్దేశ్యంలో .... నేనుకూడా మంచిదాన్ననా ?

రం : కాదని అనగలనా ! మీలాంటి తెలివైన మంచి వ్యభిచారిణి మరొకరు ఉండబోరని నా ఉద్దేశం.

సా : ఏం పేలుతున్నారు ! నోరు సంభాళించుకోండి !

రం : క్షమించండి.....మీరు సత్యాన్ని ప్రేమించారా ?

సా : అది మీ కనవసరం.

రం : పెళ్ళిచేసుకుంటారా ?

సా : అదే అడగవద్దన్నా.

రం : సరదాగా యౌవనంలో అతనితో కులుకుతారా ?

సా : మితిమీరి మాట్లాడుతున్నారు.

రం : క్షమించండి....సత్యం మీతో ఒక రహస్యం చెప్పమన్నాడు.

సా : (చిరాకుగా) ఏమిటి ?

రం : మిమ్మల్ని జీవితంలో యింక ఒంటరిగా కలుసుకోనన్నాడు.

సా : మీ రెవరూ అది చెప్పడానికి !....సత్యం సంగతి నాకు తెలుసు.

రం : మీ కన్నా నాకు ఎక్కువ తెలుసు. మిమ్మల్ని పెళ్ళిచేసుకో మన్నాను. భయపడ్డాడు. అటువంటివాడి స్నేహంకోరి మీ జీవితాన్ని పాడుచేసుకుంటారా ?.....

సా : మీరు సత్యం స్నేహితులౌతే అవవచ్చు. కాని ఇంత చనువుగా అనవసర సంభాషణ చెయ్యకండి.

రం : నిజం చెబితే నిష్ఠూరం....వ్యభిచారిణికి ప్రేమించేవాడు అక్కర్లేదు....కామించి మోసం చేసేవాడు కావాలి.

సా : ఛ....మీతో నాకు మాటలేమిటి ? (వెళ్ళిపోబోతుంది)

రం : క్షమించండి....ఆగండి....ఇది మీకు సత్యం ఇమ్మన్నాడు.

సా : (వెనక్కి తిరుగుతుంది. రంగడు ఒక పువ్వు అందిస్తాడు—అందుకోదు) ఉత్తరం అనుకున్నా.

రం : నేతపాలా బంట్రోతును కాదుగా....అయినా ఉత్తరం కూడా ఉంది....చదువుకుంటారా ?....ఇదిగో ! (జేబులోంచి ఉత్తరం తీసి యిస్తాడు)

సా : (కొంత చదివి) సూర్యారావు చేసిన ద్రోహం నా జీవితం పాడుచేసింది.....ఎప్పుడో చెపుదామనుకున్నాను.....కాని క్షమిస్తావో

దూరంగా వెళ్ళిపోయావు....ఆయన ఇప్పుడు హైద్రాబాదులో ఉంటున్నాడట. (కోపంతో) ఏమిటిది ?

రం : నీ తండ్రి ప్రతాపం !

సా : (ఉత్తరం విసిరేస్తుంది. రంగడు తీసుకుంటాడు) నా సంగతి నీకింకా తెలియదు. జాగ్రత్తగా మసులుకోకపోతే చెప్పుదెబ్బలు తప్పవు.

రం : నువ్వు రౌడీ సావిత్రివి అయితే, నేను రౌడీ రంగణ్ణి.....తప్పేం లేదు....మనం యిద్దరం అన్నా చెల్లెళ్ళం కదూ....లేకపోతే మరొకడైతే ఈ పరిస్థితుల్లో నిన్నేం చేసేవాడో.....కాని నీ కుటుంబంలో ఉన్న నీచ లక్షణాలు నాలో రాలేదు యింకా.

సా : నోర్ముయ్యి....నువ్వేం మాట్లాడుతున్నావో నీకు తెలియట్లం లేదు,...నీలాంటి నీచుణ్ణి పలుకరించడం నాతప్పు. (రుసరుసలాడుతూ పోతుంది)

రం : వెళ్ళు....నే మాట్లాడిన విషయంలోని రహస్యం నీ ప్రియుడు చెబుతాడు ! హు....యీవేళ బలేరోజు....(జామిపండు కోస్తుంటాడు) ఏమంటావు లిల్లీ .

[లాల్చీ, పంచ, మెళ్ళో కండువా—ముసలి వాలకం—పరమేశం ప్రవేశం. చేతిలో ఆఫీసు కాగితాలు]

ప : (ప్రవేశించి, రంగడిని చూసి) అం....యిక్కడ ఎవడో ఉన్నాడ్లే! (వెనక్కి తిరిగిపోతాడు)

రం : పంతులుగారూ !

ప : ఎవరది ?

రం : నేను—రంగణ్ణి.

ప : నిన్నెప్పుడూ చూసిన జ్ఞాపకం లేదే.

రం : మీరు గొప్పవాళ్లు. మాలాంటి బీదవాళ్ళని జ్ఞాపకం ఉంచు కోరుగా.

ప : ఏదో ! ముసలితనం వచ్చి జ్ఞాపకంపోతోంది. అయితే నన్ను ఎరుగుదువన్నమాట నువ్వు.

రం : ఎరుగుదునండి. మిమ్మల్ని యిక్కడ చూస్తున్నానుగా.

ప : (తెల్లబోయి నవ్వుతాడు) యిదా పరిచయం.

రం : ఇంతకన్న ఎక్కువ ఎందుకులెండి.....జామిపండు కావాలా ?

ప : ఆకలి లేదు.

రం : అవునండి....డబ్బున్నవాళ్ళకి ఆకలి ఉండదు. మాలాటి బీద వాళ్ళకి ఎప్పుడూ ఆకలే.

ప : డబ్బున్నవాళ్ళకు శాంతి లేదు. కాని బీదవాళ్ళకు అంతా శాంతే !

రం : అది నా విషయంలో తప్ప, ప్రతిచోట నిజం కాదులెండి.... ఉద్యోగంచేస్తున్నారా !

ప : గుమాస్తా పని ! (ఆలోచిస్తుంటాడు)

రం : ఏదో ఆలోచిస్తున్నారు ?

ప : జీవితం గురించి.

రం : అది చాలా అగాధం. అనంతం.

ప : అందుకే చిక్కుల్లో పడి బాధపడుతున్నా.

రం : మీకు పిల్లలా ?

ప : ఎదిగిన ఆడపిల్లలు అరడజనుమందున్నారు.

రం : నా కుక్కపిల్లను కూడా బహుమతి యివ్వేవా మీకు ?

ప : (నవ్వుతాడు)

రం : రానంటూంది కుక్కపిల్ల!

ప : అది మంచిది. దరిద్రులదగ్గరికి రాకూడదు.

రం : మీ పిల్లలు చదువుకుంటున్నారా ?

ప : ఎదిగిన పిల్లలకి ఇంకా చదువెందుకు ? పెళ్ళిళ్ళు చెయ్యాలి.

రం : అయితే పెళ్లిళ్లు చేసెయ్యండి. ఒకపూట భోజనంకూడా దొరుకుతుంది నాకు.

ప : మాటలంత సులభంకాదు - పెళ్లిచెయ్యడం.

రం : ఏం ?

ప : ఆ గొడవలన్నీ నీకెందుకు . ఆకలేస్తోంది. ఆ జామిపండు పెట్టు. (పరమేశం తింటాడు) నువ్వు ఎవరబ్బాయివి ?

రం : నాకు తలిదండ్రులు లేరు.

ప : చనిపోయారా ?

రం : ఉన్నా చనిపోయినట్టే.

ప : అడగటం నాదేతప్పు .... పిల్లలకు పెళ్లి చెయ్యాలనుకున్నప్పుడు ప్రతి కుర్రాడిమీదకు దృష్టిపోతుంది ముసలాళ్లకు.

రం : తప్పులేదండి. కాని పెళ్లిచెయ్యకపోతే, హాయిగా చదువులు చెప్పించి ఉద్యోగాలు చేయించకూడదండీ అమ్మాయిలచేత?

ప : అది గుమాస్తా బ్రతుకులకు కుదరదోయి! .... నాకు ఒక్కటే నమ్మకం. ఆడవాళ్లకు ముడిపడిన మగవాడి బ్రతుకు అధోగతి పొందుతుందోయి !

రం : మంచి అసత్యం సెలవిచ్చారు .... లేకపోతే దేవుడికి తెలియక ఆడదాన్ని పుట్టించాడా ?

ప : కాదు — మగవాణ్ణి పీక్కు తినడానికి— ఏదీ ఇంకొంచెం జామి పండు ముక్క పెట్టు .... ఆకలేస్తోంది.

రం : జామిపండు అయిపోయింది. వేరుసెనగకాయలు కావాలా ?

ప : రెండు పడేయి. (నములుతూ) అబ్బబ్బ ! సంసారం ఏం బాధ!. పెద్ద నరకమోయి !

రం : అయితే నా ఒంటరిబ్రతుకే నయం అన్నమాట.

ప : నీకు పెళ్లికాలేదన్నమాట ... పోనీ నాకెందుకులే ... ఇదిగో నువ్వు ఆప్తుడిలా కనిపిస్తున్నావు కనుక అసలు విషయం చెబుతున్నా ... గుమాస్తా బ్రతుకు అంటే ఉత్తి పనికిమాలిన బ్రతుకు. ముసలి గుమాస్తాలందర్నీ ఒక మ్యూజియంలో పెడితే, చరిత్రకారులకు చాలా ఉపయోగం కల్గుతుంది ... తల్చుకుంటూంటే గుండె తరుక్కు పోతుంది...ఈ పరమేశం పరపతి, మర్యాద మంటకలిపిందోయి ! ఒక ఆడది...అందుకే యీ పిల్లలకు ఎలా పెళ్లిళ్ళు చెయ్యాలా అని సహస్రవిధాల ఆలోచిస్తున్నాను. ఆలోచించడమే కాని సమస్య చచ్చినా తెగదు.

రం : ఏది ఎల్లా జరగాలో అల్లా జరుగుతుంది — మీకింత బాధ ఎందుకు ?

ప : కట్నాలో ?

రం : నేను మీకు సహాయం చెయ్యనా ?

ప : నువ్వే బికారిలా ఉంటే... ?

రం : దానికేం ! తల్చుకుంటే ఎంతో డబ్బు వస్తుంది.

ప : ఎల్లా ?

రం : దొంగతనాలవల్ల. ధనికులను దరిద్రులను సమానస్థాయికి తేవా లంటే దొంగతనం ఒక సాధనం.

ప : బాగుంది నీ సిద్ధాంతం! నీకో దండం! ఆ పనిమాత్రం చెయ్యకు. నా పిల్లలకు పెళ్ళి కాకపోయినా పర్వాలేదు.

రం : (నవ్వి) దొంగతనం సమాజం హర్షించదు. కడుపుమాడ్చుకొని గతిలేక లేని ధైర్యం తెచ్చుకొని దొంగతనం ఎవరైనా చేస్తే, దానం యిష్టంలేని దయామయులు అతనికి శిక్ష విధిస్తారు, దొంగతనం చేసినందుకు కాదు, తమలా నాజూకుగా ప్రజలను దోచుకుని దొంగతనం చెయ్యనందుకు.

ప : (నవ్వి) పోనీలెద్దూ నువ్వూ నేనూ దొంగలము కాదుగా! మన కెందు కా గొడవలు....(గద్గదంగా) మా పెద్దమ్మాయి ఆ పని చెయ్యకపోతే నేను ఎంతో హాయిగా ఉండేవాణ్ణి. నా పిల్లలకు పెండ్లిచేసేవాడిని....కాని ఇప్పుడు ఎవరూ నా ముఖం చూడ రుగా.....

రం : అసలు ఏం జరిగింది ?

ప : పోనీలే......అవంతా నీ కెందుకు— రెండు వేరుసెనగకాయలు యిలా పడెయ్యి.

రం : (యిస్తాడు) ఇప్పుడు చెప్పండి.

ప : (కాస్త తిన్నాక) నాకు యిప్పటికీ ఏడుపు వస్తుంటుంది. నా మొదటి భార్యకు పుట్టింది లలిత.....ఒకత్తే కూతురు. గారా బంగా పెంచా.స్కూలు ఫైనలు చదువుతోంది .. ఎవరో సూర్యా రావుట, మోసంచేసి లేవదీసుకుపోయాడు. గర్భవతిగా యింటికి వచ్చింది. రోషంతో యింట్లోంచి గెంటేశాను. తర్వాత ఆమె తల్లి చనిపోయింది. అది ఎక్కడుందో మాత్రం తెలియదు......

ఇరవై సంవత్సరాలక్రిందటి సంఘటన...కాని ఆ మచ్చ నన్ను వెన్నంటుతూనే వుంది.

రం : అంటే అపరాధంచేసిన ఆడదానికి అభయం యివ్వలేక నిస్సంకోచంగా గెంటేశారన్నమాట ! ఆ సూర్యారావుని పట్టుకుని పెళ్ళి చెయ్యగలిగే ధైర్యం మీలో లోపించిందన్నమాట ! ఇంతకన్నా రుజువెందుకు మీరు ఒక అసమర్థుడు, పిరికిపంద అని చెప్పడానికి..

ప : ఏం చేస్తాను—నల్గురూ నానా మాటలూ అంటూంటే ?

రం : అందుకే మీ పాపఫలంగా దేవుడు మరో అరడజను ఆడపిల్లలను ప్రసాదించాడు మీకు....మీ పెద్దకూతురే మీదగ్గర వుంటే మీరు పెళ్ళిచేసుకునేవారా మళ్ళీ....

ప : అదీ నిజమే !.....కాని ప్రస్తుతం అవస్థపడుతున్నానా !

రం : మీ పెద్దమ్మాయి కొడుకు మీకు కనిపిస్తే ఏంచేస్తారు ! బ్రతికివున్నాడా ?.....

ప : ఏం చేస్తాను....ఏం చేయగలను ?

రం : గెంటేస్తారు....అవునా ?

ప : పోనీలెద్దు....ఆ కుర్రాడి గొడవ నీ కెందుకు ఊరుకో—రెండు వేరుసెనగకాయ లియ్యి....

రం : ఇవ్వను....నీ లాంటి పిరికిపంద ఆకలితో చావాలి. నంఘం కట్టుబాట్లలో చావాలి. అలోలక్ష్మణా అని అగచాట్లుపడుతూ చావాలి. స్వార్థంతో కన్నకూతురి క్షేమం దోచుకున్న దొంగవు నువ్వు.

ప : ఏమిటి అంటున్నావు ?

రం : నువ్వొక పిరికిపందవు....సంఘాన్ని ఎదుర్కోలేని పిరికిపందవు... నిన్ను చంపేసేవాడిని....కాని పిరికిపందని చంపడం నా శౌర్యానికే మచ్చ.

వ : నువ్వు పిచ్చివాడిలా ఉన్నావే.

రం : (వికటంగా నవ్వి) ఆఁ...పిచ్చివాడినే...జామిపండు, వేరుసెనగకాయలు అయిపోయాయిగా ! వెళ్ళు !

( మెల్లిగా నిష్క్రమిస్తాడు పరమేశం )

వీడి మనమణ్ణని చెప్పుకోవడం సిగ్గుచేటు నాకు ! పిరికిపందలు, మోసగాళ్ళు, నీచులు, దొంగలు సంఘం అంతా ! ఛీ (వేరుసెనగ చిదుపుతుంటాడు పేకముక్కలుచూస్తూ) అందరికంటే నువ్వే మంచిదావు లిల్లీ !

కుర్రాడు : బాబూ ! పాలిష్ !

రం : (తీవ్రంగాచూసి నవ్వుతాడు)

కు : ఒక్కణా సార్ ! సరిక్రొత్తగా పాలిష్ చేస్తా !

రం : పైసలులేవు భాయీ !

కు : ఒక్కఅణాలేదుసార్ !

రం : బీదవాళ్లకి యివ్వడానికి ధనవంతులదగ్గర డబ్బుండదులే !

కు : ప్రొద్దున్నుంచి ఏమీ దొరకలేదు సార్ ! ఒక్కణా యివ్వండి సార్ !

రం : నిజంగా ?

కు : ఆకలేస్తోంటే అబద్ధమాడుతానాసార్ !

రం : సరే పాలిష్‌చెయ్యి....(కుర్రాడు చేస్తుంటాడు) నీపేరు ?

కు : రాముడు.

రం : ఎక్కడుంటావు ?

కు : ఆ దూరానవున్న గుడిసెల్లో!

రం : ఆఁ...ఎప్పుడూ కనిపించావుకాదే? నేనూ అక్కడే వుంటున్నా.

కు : నేను యీ మధ్యే హైద్రాబాదు వచ్చేను సార్!

రం : ఎక్కడినుంచి ?

కు : బెజవాడనుంచి.

రం : మీ అమ్మ, నాన్న యిక్కడేవున్నారా?

కు : అమ్మ చచ్చిపోయింది సార్ ! నాన్న ఎవరో తెలియదు.

రం : (తేరిపారచూసి) మీ అమ్మ పేరు ?

కు : లలితమ్మ.

రం : మీ అమ్మ ఎప్పుడు పోయింది ?

కు : నెల్లాళ్ళయింది. అమ్మచావు జ్ఞాపకమొస్తోంటే ఏడుపొస్తుంది. బూట్లు పాలిష్‌చేసి నేను అప్పుడప్పుడు పావలా అర్థా యింటికి తెచ్చేవాడిని...కాని అమ్మ దాసీపనికూడా ఎక్కడా సంపాదించుకోలేకపోయేది—తండ్రి లేనివాడినని నన్ను అందరూ అసహ్యంతో చూసేవారు. డబ్బు సంపాదించడానికి ఎవరి సహాయం పొందలేక పోయేవాణ్ణి....ఒకరోజు అమ్మకు జ్వరం వచ్చింది. తర్వాత ఎక్కువైంది...మందు పుచ్చుకోడానికి చేతిలో డబ్బులేకపోయింది. నానా అవస్థలతో గిలగిల బాధ పడి చనిపోయింది. నా కొక అన్నయ్య ఉన్నాడట....అమ్మమీద కోపం వచ్చి నేపుట్టేముందు వెళ్ళిపోయాడట...అసలు అన్నయ్య మీది బెంగతోనే అమ్మ చచ్చిపోయింది.

రం : మీ అమ్మ ఎలా ఉంటుంది ?

కు : తెల్లగా, బక్కపలచగా, కొంచెం పొట్టిగా ఉంటుంది. కుడిచేతి మీద పెద్ద పుట్టుమచ్చ ఉంది.. .ఆఁ ఫొటో కూడా ఉంది నా దగ్గర....చూడండి సార్ !

రం : (చూసి దుఃఖంతో) రాముడూ....ఇంక జోళ్ళు తుడవకు చాలు... ఎంత కావాలి ?

కు : ఒక్క అణా సార్.

రం : ఒక్క అరగంటక్రితం నువ్వు కనిపిస్తే ఒక్క అణా కాదు— అయిదువందల రూపాయలు నీకు యివ్వగలిగేవాణ్ణి. అంత డబ్బు నాకు ఉపయోగం ఉంటుందనుకోలేదు.

కు : మీరు చాలా మంచివారు సార్.

రం : రాముడూ..., నేనే మీ అన్నయ్యనైతే ?

కు : నిజంగావే....నా అన్నయ్య....(ఆనందంతో) నా అన్నయ్య.... (దగ్గరగా పరుగెత్తి కౌగలించుకోబోతాడు) అమ్మ చనిపో పోయింది అన్నయ్యా ! (ఏడుస్తాడు)

రం : ఊరుకో రాముడూ....(గద్గదంతో) అమ్మ చనిపోయింది....పరిస్థితులవల్ల కులటగా పరిగణించబడింది....అయినా నా అమ్మ ఎంత మంచిది.

రా : నాన్న పేరు ఏమిటి అన్నయ్యా ?

రం : ఎవడైతేనేం ? పేరు కర్కోటకుడు. మన యిద్దరి తండ్రి ఒకడైనా కాకపోయినా, వాడి పేరు కర్కోటకుడే.... మనం మాత్రం ఒకతల్లి పిల్లలం.....ఇది నిజం.

రా : నాన్న పేరు నీకు తెలియదా అన్నయ్యా ?

రం : చెప్పాగా ! అంతే.

రా : అబద్ధం ఆడుతున్నావు.

రం : అబద్ధం నాకు అవసరం లేదు.

రా : మీరు నా అన్నయ్య కాదు సార్.....క్షమించండి. (పాలిష్ సామాన్లు తీసుకుంటాడు) అణా యివ్వండి సార్.

రం : రాముడూ ఇది నిజం. ఒక తల్లికి పుట్టాం. నువ్వు అమ్మ గర్భంలో ఉన్నావు. నేనెలా పుట్టానో నాకు తెలుసు. నన్ను సంఘం ఏమనేదో ఎంత బాధపడేవాడినో నీకేం చెప్పగలను. ఆ పరిస్థితిలో అమ్మ పెళ్ళిచేసుకోవాలనే కోరికతో మునుపటి తప్పే మళ్ళీ చేసింది. నువ్వు ఆమె గర్భాన పడ్డావు. అది చూసి అమ్మను అసహ్యించుకొని నేను దూరంగా వచ్చేశాను. తర్వాత అమ్మకు ఉత్తరం వ్రాశాను. విచారిస్తూ ఒక ఉత్తరం వ్రాసింది. ఇంక అమ్మను చూడదల్చుకోలేదు. తర్వాత వారాలు చేసుకున్నా. కష్టాలుపడ్డా. క్లలుఫైవలుదాకా చదివాను, చదువుకూ జీవితానికీ సంబంధం లేదని చదువు మానేశాను. ఉద్యోగం లేదు. డబ్బు దొరకడం కష్టమయింది ... జూదం మొదలెట్టా...ఏదో ధనం సంపాదిస్తున్నా. నా జీవితంలో జరిగిన పాత పాపాలు మర్చిపోడానికి మనశ్శాంతికి త్రాగుడు నేర్చుకోవలసి వచ్చింది. ఈ కుక్కపిల్ల దొరికింది. ఇప్పుడు చాలా హాయిగా వున్నా ... కాని నాకు నువ్వుకూడాకావాలి రాముడూ ! నా తమ్ముడిలా — నువ్వు ఉంటే, ఈ వ్యసనాలు ఒదిలేయగలను రాముడూ...మమతల మాధుర్యంలో మానవ జైజమే మారిపోతుంది.!

రా : (దగ్గరికి వస్తాడు) అ....న్న....య్యా...